# ఆసుర నాగరికత

ముక్కామల నాగభూషణం

కృష్ణాజిల్లా రచయితల సంఘం



# అసుర నాగరికత

## పరిశోధన గ్రంథం

ముక్కామల నాగభూషణం

ప్రచురణ :

కృష్ణాజిల్లా రచయితల సంఘం

విజయవాడ

# ASURA NAGARIKATA

*by* **Mukkamala Naga'**

ప్రథమ ముద్రణ : 1992 మే

1000 కాపీలు

ప్రచురణ నెం. 5

**వెల : రు. 10.00**

ప్రతులకు :

విశాలాంధ్ర బుక్ హౌస్

విజయవాడ, విశాఖపట్నం, హైదరాబాద్, అనంతపురం,
గుంటూరు, తిరుపతి, హన్మకొండ, కాకినాడ.

ముద్రణ :

శ్రీ అరుణోదయ ప్రింటి

సీతారామపురం, విజయవాడ-[illegible] 002.

# పురోగమనంలో....

కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రతి రెండేళ్ళ కొకసారి తనదైన ప్రత్యేక రీతిలో నిర్వహించే మహాసభలు ఎనిమిదవసారి విజయవాడలో 9-10 మే, 92 తేదీలలో జరుగుతున్నాయి. ఈ సందర్భంగా— భూపొరలలో నిక్షిప్తమైపోయిన అలనాటి సింధునాగరికతా వైభవాన్ని ఒక కొత్త దృష్టితో విశ్లేషించిన ఈ "అసుర నాగరికత" గ్రంథాన్ని విడుదల చేయగలగడం మా అదృష్టంగా భావిస్తున్నాం.

ఇది మా ఐదవ ప్రచురణ—

వేద వేదాంగశాస్త్రాలలో నిష్ణాతుడు శ్రీ ముక్కామల నాగభూషణం ఈ గ్రంథంతో ప్రాచీన భారతీయ సంస్కృతి విషయంలో ఏర్పడిన అనేక అపోహలను పటాపంచలు చేశారు.

మన సంస్కృతి వికాసాలను తెలుసుకోగోరే ప్రతి ఒక్క పాఠకుడు తప్పక చదివి తీరవలసిన రచనగా భావిస్తూ తెలుగు పాఠక ప్రపంచానికి ఈ "అసుర నాగరికత" గ్రంథాన్ని సగర్వంగా సమర్పిస్తున్నాం.

మా ప్రచురణల పట్ల, మేం నిర్వహించే కార్యక్రమాలపట్ల ఆసక్తిని కనపరుస్తూ మమ్మల్ని ప్రోత్సహిస్తున్న సాహితీ మిత్రులకు, పెద్దలకు మా నమోవాకాలు....

గుత్తికొండ సుబ్బారావు
ప్రధాన కార్యదర్శి

## ఇందులో....

| | పేజి |
|---|---|
| పీఠిక | 1 |
| పాత రాతియుగం | 5 |
| పశువుల మందల పెంపకం-వ్యవసాయం | 9 |
| సింధు నాగరికత | 13 |
| సింధు నాగరికత ఆర్యులదా? | 20 |
| సింధు నాగరికత ద్రవిడులదా? | 39 |
| సింధు నాగరికుల భాష | 50 |
| అణగారిపోయిన గిరిజనులు | 81 |
| సింధు నాగరికతలో ధనిక పేద తారతమ్యాలు | 85 |

ఈ గ్రంథ రచనకు అనేకమంది పురాతత్వ శాస్త్ర పరిశోధకుల వ్యాసాలు సహాయపడ్డాయి. వారందరికి రచయిత కృతజ్ఞతలు.

## ముఖ్యమైన తప్పులకు ఒప్పులు

| పేజి | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 14 | 20 | మార్వల్ | మార్షల్ |
| 22 | 17 | ఆయరమ్మన్య | అయరమైన్య |
| 30 | 7 | చరిక్రారులు | చరిత్రకారులు |
| 42 | 12 | నుంటి | నుండి |
| 44 | 2 | తెనుగు | తెనగు |
| 45 | 13 | గూర్చి | గురించి |
| 50 | 13 | కిట్టైవ్ | కిట్టైల్ |
| 51 | 17 | సాలీ | పాలీ |
| 60 | 3 | 3940 | 3340 |

1

# పీఠిక

మానవ వికాస పరిణామ క్రమమంతా ఆటుపోటులతో నిండివుంది. విజ్ఞానం-అజ్ఞానం, ఏకత్వం భిన్నత్వం పెనవేసుకుపోయాయి.

చరిత్రను పరిశీలిస్తే, రక్తసిక్తమైన పుటలనేకం కనిపిస్తాయి. పరపీడనవల్ల కొన్ని తెగలు నశించాయి. మరికొన్ని తెగలు నామమాత్రంగా జీవించి వున్నాయి.

ఒకానొక చారిత్రక దశలో సర్వాధికారాన్ని చలాయించిన తెగలు మరొక దశలో బానిసత్వంలో పడి మగ్గిపోయాయి. ఒక దశలో బానిసలుగా బ్రతికినవారు మరొక దశలో అధికారాన్ని పొందగలిగారు. పగలు-రాత్రి, వెలుగు-చీకటి మాదిరిగా అనేక ఘటనలు జరిగాయి.

రెండున్నరవేల సంవత్సరాలక్రితం గ్రంథ రచన ప్రారంభమైనప్ప టికీ మన పూర్వీలు చరిత్ర వ్రాయలేదు. కాని లెక్కలేనన్ని పురాణాలు వ్రాశారు. వాటిని చదివితే చరిత్ర యావత్తూ దేవ దానవ, సురాసుర యుద్ధాలతో నిండివున్నట్లుగా కనిపిస్తుంది.

అధర్మాన్ని, ధర్మంగాను, హింసను అహింసగాను చిత్రించేందుకు అవతారాల సిద్ధాంతాన్ని, కర్మ-పునర్జన్మ సిద్ధాంతాన్ని అడ్డం పెట్టుకున్న సందర్భాలు, పరిణామ సిద్ధాంతాన్ని పాతిపెట్టిన సందర్భాలు చాలా వున్నాయి.

విష్ణుమూర్తి వరాహావతారమెత్తి హిరణ్యాక్షుని చంపడం, వరహావతారాన్ని భూదేవివరించడం, నరకాసురుడు జన్మించడంలాంటి పురాణ గాథల నెలా నమ్మడం ? పాండవులు దేవతలకు పుట్టారని, ద్రోణుడు కడవలో పుట్టాడని, కృపాచార్యుడొక స్తంభంలో పుట్టాడని, ద్రౌపది దృష్టద్యుమ్నుడు అగ్నిగుండంలో పుట్టారని నమ్మగలమా ?

వాల్మీకి రామాయణం చదివితే ఆర్య-ఆర్యేతరుల మధ్య జరిగిన యుద్ధాలు, ఒడంబడికలు కనిపిస్తాయి. రామలక్ష్మణులకు - ఆంజనేయ సుగ్రీవులకు మధ్య జరిగిన ఒడంబడిక ప్రకారం, శ్రీరాముడు వాలినిచంపి సుగ్రీవునకు పట్టం కట్టాడట. రావణాసురాది రాక్షసులను చంపి, సీతాదేవిని రక్షించేందుకు, సుగ్రీవాది వానరులు శ్రీరామునకు తోడ్పడ్డారట. శ్రీరాముని పక్షాన చేరిన విభీషణునకు లంకారాజ్యం దక్కిందట.

విభీషణుని చర్యను సమర్థిస్తూ పండితులు చాలా వ్రాశారు. అయినా ఆయనగారి స్వార్థం చెరిగిపోలేదు. శత్రువులతో కుమ్మక్కు అయినవారిని "విభీషణాయలు"గా చిత్రించి నిందించడం జరుగుతూనే వుంది.

అన్నదమ్ముల మధ్య జరిగినట్లుగా వర్ణింపబడిన యుద్ధం ప్రాతిపదికగా మహాభారతం రూపొందింది. యుద్ధానికి మూలం రాజ్యకాంక్ష. అందువల్ల అనేక అన్యాయాలు, పోరాటాలు జరిగాయట. కనుక వాటిని కప్పిపెట్టేందుకు పూనుకున్న పండితులు గణధర్మానికి తావులేకుండాచేసి, క్షాత్ర ధర్మాన్ని నెలకొల్పారు. పదే పదే అవతారాల సిద్ధాంతాన్ని అడ్డం పెట్టుకున్నారు.

అయినా ఆర్య-ఆర్యేతరుల మధ్య జరిగిన యుద్ధాలు, సంబంధ బాంధవ్యాలు, ఆదానప్రదానాలు భారతంలో కనుపిస్తున్నాయి. కాని వాటిని వర్ణించిన తీరువల్ల చరిత్ర కనుమరుగై పోయింది.

ఆర్యులు సప్త సింధుప్రాంతంలో నుండగా అసురుల పట్టణాలను ధ్వంసం చేశారు. ఆ ఉదంతం త్రిపురాసుర సంహారంగా చిత్రించబడింది. ఆర్యులు గంగానదీ మైదానాల్లో ప్రవేశించిన పిమ్మట, అక్కడనుండి నాగులను తరిమివేశారు. అటు పిమ్మట నాగులు పరీక్షిన్మహారాజును చంపి పగదీర్చుకున్నారు కనుక జనమేజయుడు నాగులమీద దాడి జేశాడు. ఆ ఘటనలే ఖాండవ దహనం, పరీక్షిత్తు శాపం, జనమేజయుని సర్పయాగ గాథలుగా రూపొందాయి. చరిత్రకు గ్రహణం పట్టింది.

మానవుడు సృష్టించిన తొలి నాగరికత సింధు నాగరికత. ఆనాగరికత విషయం 1875 వరకూ ఎవరికీ తెలియదు. అది నివురు గప్పిన నిప్పులా భూగర్భ శిధిలాల్లో నిలిచివుంది. అజంతా ఎల్లోరా గుహల సౌందర్యం కీకారణ్యంలో దాగివుంది. అంకగణితం, బీజ గణితం వృద్ధి చేసినవారు భారతీయులేనన్న విషయం నిన్న మొన్నటిదాకా ఎవరికీ తెలియలేదు.

భారత ఉపఖండంలో ఆర్యులు ప్రవేశించకముందే నీగ్రిడ్, ముండా, దానవాది తెగలనేకమున్నాయి. దానవులు రాక్షసులు అసుర తెగలలోనివారు. వారి దేవతలు అసురులు. వేదకాలంనాటి ఆర్యుల దేవతలు కూడా అసురులే.

అయినా దానవ రాక్షసాదులను ఘోరాకారులుగా నరమాంసభక్షకులుగా, మాయలమారి దొంగలుగా చిత్రిస్తూ, ఆర్య పండితులు అనేక గ్రంథాలు వ్రాశారు. కాని, సింధు నాగరికతను సృష్టించినవారు అసురులేనన్న సత్యాన్ని, భూగర్భశిథిలాలు, పురాతన వస్తువులు, భాషలు మున్నగునవి రుజువు చేస్తున్నాయి.

ఒకవైపున నాగరికత పెరుగుతోంటే, మరోవైపున గణతంత్ర వ్యవస్థ భగ్నమైంది. అనేకమంది ప్రజలు స్థానభ్రష్టులై కీకారణ్యాలలోకి పోయి బ్రతికారు. అలాంటివారిప్పటికీ గిరిజనులుగానే జీవిస్తున్నారు. కనుకనే....

"ఐదువేల ఏళ్ళక్రితం సింధులోయలోని ప్రాచీన గణసంస్థల శిథిలాలమీద రాజ్యస్థాపన జరిగింది. అదెలా జరిగిందోనన్న విషయాన్ని చరిత్రకారులు స్పష్టంగా వివరించవలసివుంది" అన్నాడు శ్రీ దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ.

కనుక సింధు నాగరికత అసురులదేనని రుజువుచేస్తూ, ఆ దశలో అణగద్రొక్కబడిన తెగలను పేర్కొంటూ, సాధ్యమైనంతవరకూ నిజ చరిత్రను వెల్లడించడం అవసరమని భావించాను. నా ఈ రచనను సహృదయులు హర్షిస్తారని, ఏదైనా తప్పులుంటే క్షమించి నాకు తెలియజేస్తారని విశ్వశిస్తున్నాను.

5

# పాత రాతియుగం

పాతరాతియుగం నాటి పనిముట్లు దక్షిణభారత్‌లో చాలాచోట్ల కనుపించాయి. ఉత్తరభారత్‌లోనూ కనుపించాయి. కాని వీటిమధ్య చాలా భేదముంది. దక్షిణాదిన దొరికిన రాతి ఆయుధాల మొనలు గొడ్డలి మొనలా వుంటే ఉత్తరాదిన దొరికిన వాటి మొనలు కత్తిమొనలా వున్నాయి. ఈ రెండురకాల రాతి ఆయుధాలు మధ్యభారత్‌లో కనుపించాయి. కనుక దక్షిణ భారత్‌లో వృద్ధిబొందిన తెగలతో పాటు ఉత్తరభారత్‌లో వృద్ధి బొందిన తెగలు కూడా మధ్యభారత్‌కు విస్తరించినట్లుగా స్పష్టమైంది.

ఉత్తరభారత్‌లో దొరికిన రాతిపనిముట్ల లాంటివి కజఖస్థాన్ రిపబ్లిక్కులో "బోరీకజ్గాన్" వద్దకూడా దొరికాయి. కనుక కజఖస్థాన్ నుండి కొన్ని తెగలు వచ్చి భారత ఉపఖండంలో విస్తరించాయా? లేక ఉత్తరభారత్ నుండి కొన్ని తెగలువెళ్ళి కజఖస్థాన్‌లో విస్తరించాయా అనే విషయాన్ని తెలుసుకునేందుకు ఉభయదేశాల శాస్త్రవేత్తలూ కలిసి కృషి చేస్తున్నారు.

అలా అటూ ఇటూ విస్తరించిన పాతరాతియుగం దాదాపుగా ఐదు లక్షల సంవత్సరాలకాలం కొనసాగిందని శాస్త్రవేత్తలు నిర్ణయించారు.

## మధ్యభారత్‌లో నీగ్రిడ్సు

పాతరాతియుగపు చివరిదశలో నీగ్రిడ్సు (నీగ్రిటోస్) పై చేయిసంపాదించారు. ఖైర్‌మూర్ పర్వత గుహల్లో కన్పిస్తున్న పసరు రంగుల చిత్రాలు నీగ్రిడ్సు ఆధిక్యతకు ప్రతిబింబాలుగా వున్నాయి. మొరటు రాతి పనిముట్లను తయారు చేయడంలోను, పసరురంగుల చిత్రాలు వేయడం లోను వారికి వారే సాటి.

పాతరాతియుగంలో పెద్ద పెద్ద బండలమీద పసరురంగులతో వేసిన చిత్రాలను మధ్యభారత్‌లోని ఖైర్‌మూర్ పర్వత గుహల్లో కనుగొన్నారు. ఈ చిత్రాలు ఆఫ్రికాలోను, స్పెయినులోను కనుపించిన చిత్రాలను పోలి వున్నాయి. ఆనాడు మధ్యభారత్‌లో నివసించిన తెగలకు, ఆఫ్రికాలో నున్న తెగలకు మధ్య సంబంధమున్నదనే విషయాన్ని ఈ చిత్రాలు సూచిస్తు న్నాయి" అని జి. వి. ఛిల్డే ప్రకటించారు.

ఒకప్పుడలా ముందున్న నీగ్రిడ్సు కేవలం అడవి సంపద మీద ఆధారపడి జీవించడం వల్ల వెనుకబడిపోయారు. పశువులను మచ్చికచేసి మందలను పెంచగలిగిన ముండా (కొలేరియన్) తెగలవారు నీగ్రిడ్సును లోగాని దక్షిణాదికి నెట్టివేశారు. గణతంత్ర వ్యవస్థ తలవంచడం అలా ప్రారంభమైంది.

నీగ్రిడ్ తెగల వారసులైన కాదార్, పణియన్, ఇరుల, కురుంబ మున్నగు తెగలవారిపుడు దక్షిణభారత్‌లోను, ఓంగెస్, జార్వాస్ వగైరా తెగలవారు అండమాన్ నికోబార్ దీవుల్లోను నివసిస్తున్నారు. అండమాన్

దీవుల్లో నివసిస్తున్న వారి సంఖ్య కేవలం 577 మాత్రమే. అయినా వారి భాషమాత్రం సజీవంగా వుంది.

## కాకేషియన్లు - మంగోలాయిడ్స్

పాత, కొత్త రాతియుగాల సంధికాలంలో అనగా పదివేల ఏళ్ళ క్రితం కాకేషియన్లు భరతఖండపు వాయువ్య ప్రాంతంలోను, మంగోలాయిడ్స్-మంగోలియన్ల పోలికలు గలవారు—ఈశాన్య ప్రాంతంలోను ప్రవేశించారని శాస్త్రవేత్తలు తెలుసుకున్నారు. ఆ మంగోలాయిడ్సనే ఇప్పుడు "సినోటిబెటన్" తెగలుగా పేర్కొంటున్నారు. వీరిప్పుడు వివిధ తెగలుగా చీలిపోయి అస్సాం, నాగాలాండ్, మిజోరం, గారోహిల్స్ ప్రాంతాల్లో నివసిస్తున్నారు.

కాకేషన్ పర్వత ప్రాంతాలనుండి వచ్చినవారు బహుశా ఆర్మేనియన్లు కావచ్చుననే అభిప్రాయాన్ని కొందరు శాస్త్రవేత్తలు వెలిబుచ్చారు.

## కొత్త రాతియుగం

కొత్తరాతియుగపు పనిముట్లు ముందుగా ఆంధ్రప్రదేశ్‌లో డాక్టర్ బి. సుబ్బారావు మున్నగువారి కృషివల్ల కొల్లలుగా కనుపించాయి. ఇలాంటి పనిముట్లతో పాటు పాలిష్‌చేసిన పనిముట్లను కూడా కాంగ్రా జిల్లాలోని "రోర్"వద్ద శ్రీ జి. సి. మహాపాత్రో కనుగొన్నాడు. అవి ఐదువేల ఏళ్ళ నాటివి. సరిగా అలాంటి పనిముట్లనే తజకిస్థాన్‌లో ఓక్లాద్నికోవ్, రానోవ్ మున్నగువారు కనుగొన్నారు. ఫెయిర్ సర్వీస్ అనే శాస్త్రవేత్తకు, ఆఫ్ఘనిస్థాన్‌లో కొన్ని రాతిపనిముట్లు దొరికాయి. ఇటీవల శ్రీయుతులు యఫ్. జారిగ్, ఆర్. హెచ్. మెడో కలిసి బలూచిస్థాన్‌లోని బొలాన్‌నది ప్రక్కన

గల మెహర్‌ఘర్‌లో సాగించిన త్రవ్వకాలలో వివిధ రకాల రాతి పని ముట్లు బయటపడినవి. ఇవి ఎనిమిదివేల ఏళ్ళనాటివట.

కనుక భరతఖండం నుండి కొన్ని తెగలు కాస్పియన్ సముద్రం వరకూ వెళ్ళివుండవచ్చునని శ్రీ యస్. పి. గుప్తా ఊహించాడు. ఆ కాలంలో అనేక తెగలు మధ్యాసియా నుండి వచ్చి భరతఖండంలో ప్రవేశించాయని మరికొందరు శాస్త్రవేత్తలు అభిప్రాయపడ్డారు. కాబట్టి మధ్యాసియా-భారతదేశాల మధ్య గల పురాతన సంబంధాలను సంయుక్తంగా అధ్యయనం చేసేందుకు ఉభయదేశాల శాస్త్రవేత్తలు పూనుకున్నారు. వీరి పరిశోధనల వల్ల అసలు విషయం తెలియగలదని ఆశించవచ్చు.

# పశువుల మందల పెంపకం - వ్యవసాయం

అడవిలో వేటాడి పట్టుకున్న ఆవును కోసుకుతింటే, అది ఆనాటి తోనే ఆఖరు. అలాగాకుండా ఆవును పెంచితే ఏటా ఒక దూడను పెడు తుంది. ఆవులమంద పెరుగుతుంది.

కనుక కొన్ని తెగలవారు మందలను పెంచేందుకు పూనుకున్నారు. కొత్త రాతియుగం ప్రారంభమైన పిమ్మట బెలూచిస్తాన్‌లో గొర్రెలు మేకలు ఆవులు మున్నగువాటిని పెంచినట్లుగా సాక్ష్యాధారాలు లభించాయి. అలాగే మధ్యప్రదేశ్‌లోని మాళ్వా ప్రాంతంలోకూడా పశువుల పెంపకానికి సంబం ధించిన సమాచారం లభించింది.

మందలను పెంచినవారికి పాలు వెన్న గుడ్లు మాంసం పుష్కలంగా లభించాయి. కనుక వారి శరీర దారుఢ్యం, తెలివితేటలు పెరిగాయి. మంద లను పెంచకుండా అడవి సంపదపై ఆధారపడి జీవించిన నీగ్రిడ్సులాంటి వారు వెనకబడిపోయారు.

మందల్ని పెంచడంద్వారా మానవుడు సృష్టికి ప్రతిసృష్టి చేయడం ప్రారంభించాడు. రెండు పశువుల్ని మేపి పది పశువులుగా వృద్ధిచేయడం ఒక ధాన్యపు గింజను విత్తి పదిగింజలను పండించడమే సృష్టికి ప్రతిసృష్టి. ఈవిధమైన సృష్టితోపాటు, మానవులమధ్య పని విభజనకూడా అప్పుడే ప్రారంభమైంది. పురుషులు మందలను మేపుతోంటే, స్త్రీలు ఇంటి పనులు

చేశారు. అందువల్ల పని విభజన ముందుగా స్త్రీ-పురుషులమధ్య ప్రారంభ మైందని చెప్పవచ్చు.

మందలను అడవుల్లో మేపుతూ కాపాడుకోవటం కష్టం. కొన్ని పశువులు తప్పించుకుపోతాయి. కొన్నిటిని పులులు, సింహాలులాంటి క్రూర మృగాలు చంపుకుతింటాయి. కనుక పశుపాలకులు తమ మందలతోపాటు మైదానాల్లో నివసించవలసివచ్చింది. అందువల్ల వారికొక సమస్య ఎదు రైంది. వేసవికాలంలో మైదానాల్లో పచ్చికమేత దొరకనప్పుడు మందలు క్షీణించేవి. కనుక మైదానాలకు చేరువలోనున్న ముళ్ళ తుప్పలనుకొట్టి, మొక్కా మొటికా పెంచారు. పెంచిన పైరును వేసవికాలంలో పశువులకు మేపారు. అలా ప్రారంభమైంది పోడు వ్యవసాయం.

ఏడువేల ఏళ్ళక్రితం బెలూచిస్థాన్‌లో పోడు వ్యవసాయంతోపాటు రేగు, ఖర్జూర పంటి పండ్ల చెట్ల పెంపకం కూడా ప్రారంభమైందని శాస్త్ర వేత్తలు చెప్పారు. కొంచె మించుమించుగా అదేకాలంలో మాళ్వా ప్రాంతం లోను ప్రారంభమైందట-అలా ప్రారంభమైన పోడువ్యవసాయం, విస్తృత ప్రాంతాలలో బార్లీ, గోధుమ లాంటి ధాన్యం పండించడానికి దోహదం చేసింది.

వ్యవసాయం చేయకుండా కేవలం పశువుల మందలమీద ఆధార పడుతూ, వాటి మేతకొరకు ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి, ఒక దేశంనుండి మరొక దేశానికి పోతూ, వస్తూ జీవించిన తెగలు వెనుక బడిపోయాయి. ఈనాటి గొర్రెల కాపర్లు అలా వెనుకబడిపోయినవారే.

పోడు వ్యవసాయం విస్తరించిన పిమ్మట బార్లీ, గోధుమలాంటి ధాన్యాలను ప్రజలు తిని, చెత్తను పశువులకు మేపసాగారు. ఈనాడుకూడా

ఇలాగే జరుగుతోందికదా! పశువుల మేతకొరకు ప్రారంభించిన వ్యవసాయం, మానవులకు అవసరమైన ఆహారాన్ని సమకూర్చింది. వ్యాపార పంటలకు దారిజూపింది. కనుక వ్యవసాయం వృద్ధిపొందింది. చేతివృత్తులు పెరిగాయి. వస్తుమారకం ప్రారంభమైంది. నాగరికతకు ప్రాతిపదికలేర్పడ్డాయి.

## నాగరికతకు నాంది

ఇరాన్‌లోని ఈలమ్ నాగరికతకు ప్రోదిచేసిన కృషి ఆరువేల ఏళ్ళ క్రితం ప్రారంభమైందని హెర్జ్ ఫెల్డ్ ప్రకటించాడు. సింధు నాగరికతకు దోహదంచేసిన కృషి ఏనిమిదివేల ఏళ్ళక్రితం అఫ్ఘనిస్తాన్, బెలూచిస్తాన్ ప్రాంతాలలో ప్రారంభమై రాజస్థాన్‌లోని 'కాలిబంగన్'కు విస్తరించిందని, అక్కడ వృద్ధిపొందిన పరిజ్ఞానం (కల్చర్) హరప్ప, మొహంజదారో ప్రాంతాలలో ఫలించిందని శ్రీయుతులు బి. డికార్డి, జె.యమ్. కజాల్ వివరించారు.

కొత్త రాతియుగంలో పశ్చిమోత్తర భారత్, పశ్చిమాసియా, మధ్యాసియా ప్రాంతాలు ఒకే రకమైన పరిజ్ఞానంతో విలసిల్లాయని శ్రీ భూపేంద్ర నాథ దత్తా చెప్పాడు.

శ్రీయుతులు జె.యఫ్. జారిగ్, ఆర్.హెచ్. మెడో కలసి 1973 నుండి 1980 వరకూ బెలూచిస్తాన్‌లోని మెహర్‌ఘర్‌వద్ద త్రవ్వకాలు సాగించి, వివిధ రకాల పనిముట్లను, అస్థిపంజరాలను, కట్టడాలను, ధాన్యపు గింజలను, పూసల హారాలను, కుండలను కనుగొన్నారు. కనుక ఎనిమిది వేల సంవత్సరాలక్రితం నుండి, సింధు నాగరికత ఉచ్ఛస్థితినందుకునేంత వరకూ జరిగిన క్రమాభివృద్ధిని సోదాహరణగా నిరూపించగలిగారు.

"ఎనిమిదివేల ఏళ్ళక్రితం ఎండబెట్టిన ఇటుకలతో కట్టిన కట్టడాలు మెహర్‌ఘర్‌లో కన్పించాయి. పశువులను మచ్చికజేసి పెంచిన జాడలు కూడా దొరికాయి. ఏడువేల ఏళ్ళక్రితం పండ్ల చెట్లు, బార్లీ, పత్తి పండించారని చెప్పేందుకు తగిన సాక్ష్యాధారాలు లభించాయి. ఆరువేలఏళ్ళ క్రితం కుమ్మరిసారెను కనిపెట్టడం, కుండలను ఆవలో కాల్చడం, రాగిని కరగడం, పూసలకు బెజ్జాలువేసేందుకు బర్మా (బొ-డ్రిల్‌ను) కనిపెట్టడం జరిగాయని స్పష్టంగా తెలుస్తున్నది." అని మిస్టర్ జారిగ్, మిస్టర్ మెడో వెల్లడించారు.

మెహర్‌ఘర్ బొలాన్‌నది ప్రక్కనవుంది. అక్కడ ప్రారంభమైన అభివృద్ధి కాలిబంగన్, హరప్పా, మొహంజొదారో, లోథాల్, సుకోత్తర మున్నగు ప్రాంతాలకేగాక, తూర్పు ఇరాన్, దక్షిణ తుర్క్‌మెనిస్తాన్ ప్రాంతాలకు కూడా విస్తరించిందని శాస్త్రవేత్తలు నిరూపించారు. అలా విస్తరించిన నాగరికతే సింధునాగరికత.

# 13

# సింధు నాగరికత

1875లో సర్ అలెగ్జాండర్ కన్నింగ్‌హామ్ సింధు నాగరికతకు చిహ్నమైన సీలును (ముద్రను) హరప్పలో కనుగొన్నాడు. మొహంజొదారో శిథిలాల్లో రెండంతస్తుల భవనాన్ని సర్ మార్టిమర్ వీలర్ కనుగొన్నాడు. 1930 దశకంలో శ్రీ డి.ఆర్. సహానీ, శ్రీ ఆర్. డి. బెనర్జీ పెద్దఎత్తున త్రవ్వకాలు సాగించి, పురాతన హరప్ప, మొహంజొదారో పట్టణాలు స్పష్టంగా కనబడేటట్లు చేశారు. మరికొందరు పరిశోధకులు నెవాసా నాసిక్, నవదతోలి, జోర్వే ప్రాంతాలలో అనేక వస్తువులను కనుగొన్నారు. స్వాతంత్ర్యానంతరం శ్రీయుతులు బి. బి. లాల్, యస్. ఆర్. రావు, ఎ. ఘోష్, పి.సి. పాండ్యా మున్నగువారు ప్రాచీ లోథాల్ ఓడరేవులతో సహా అనేక సాక్ష్యాధారాలను కనుగొన్నారు.

లోథాల్ ఓడరేవు నాలుగువేల ఐదువందల ఏళ్ళక్రితం నిర్మింపబడిందని శ్రీ యస్. ఆర్. రావ్ చెప్పాడు. దీని నిర్మాణం బొంబే, విశాఖపట్నం ఓడరేవులతో పోల్చదగినదిగా వున్నదని మిస్టర్ లెలే చెప్పాడు. కనుక ఇంత గొప్ప నాగరికత ఎప్పుడు ఎలా ప్రారంభమైందో తెలుసుకునేందుకు శాస్త్రవేత్తలు, చరిత్రకారులు పూనుకున్నారు.

ఈజిప్టు నాగరికత నైలునదీ ప్రాంతంలో వృద్ధి చెందితే, సుమేరియన్ నాగరికత టైగ్రిస్, యూఫ్రటీస్ నదుల దిగువ ప్రాంతంలో వృద్ధి పొందింది. అలాగే సింధు నాగరికత కూడా బొలాన్ నది వద్ద ప్రారంభమై సింధునదీ తీరాలలో వృద్ధిచెంది ఇతర ప్రాంతాలకు విస్తరించిందని శాస్త్రవేత్తలు తెలుసుకున్నారు.

సింధు నాగరికత ఆరువేల ఐదువందల ఏళ్ళక్రితం ప్రారంభమైందని నాలుగువేల నాలుగువందల ఏళ్ళక్రితం ఉన్నతస్థాయి నందుకున్నదని, మరొక ఏడువందల యాభై ఏళ్ళపాటు దేదీప్యమానంగా వెలిగిన పిమ్మట దాని క్షీణదశ ప్రారంభమైందని పలువురు శాస్త్రవేత్తలు ప్రకటించారు. ప్రపంచం మొత్తంమీద ప్రభవించిన తొలి నాగరికత సింధు నాగరికతేనని కూడా శాస్త్రవేత్తలు నిరూపించగలిగారు.

సింధు నాగరికత కేవలం హరప్ప, మొహంజొదారోలకు మాత్రమే పరిమితం కాలేదు. గంగా, యమునా నదుల ఎగువ ప్రాంతాల్లోను, నర్మదా నదీతీరంలోను, కాశ్మీర్ రాజస్థాన్, గుజరాత్, మహారాష్ట్రల్లో కూడా సింధు నాగరికతకు నిలయమైన తావులు కన్పించాయి.

అక్కడ వ్యవసాయం ఫలించడం వల్ల వృత్తులు పెరిగాయి. కుమ్మరి సారెతో పాటు పూసలకు బెజ్జాలు వేసేందుకు బౌడ్రిల్ (బర్మా)ను కనిపెట్టారు. అందువల్ల పారిశ్రామిక ప్రగతికి అంకురార్పణ జరిగింది. చేతివృత్తులవారు వస్త్రాలు, పాత్రలు, హారాలు, జాడీలు మున్నగు వాటిని తయారుచేశారు. వర్తక, వాణిజ్యాలు పెరిగాయి. బహ్రీన్, మెసపొటేమియా ప్రాంతాలతో సముద్రవ్యాపారం, మధ్యాసియా ప్రాంతాలతో రహదారి వ్యాపారం వృద్ధిచెందాయి. అందువల్ల పల్లెప్రాంతాలు వ్యవసాయ, పశుపోషణ కేంద్రాలుగా అభివృద్ధి జెందితే, పట్టణాలు వస్తూత్పత్తి, వ్యాపార కేంద్రాలుగా అభివృద్ధి జెందాయి. కనుక సింధు నాగరికతను గురించి సర్ జాన్ మార్షల్ ఇలా వివరించాడు.

"క్రమాభివృద్ధి విషయంలో సింధు నాగరికతను ఈజిప్టు, పర్షియా, మెసపొటేమియాల నాగరికతతో పోల్చవచ్చు. కాని వాటికంటే కొన్ని విషయాల్లో సింధు నాగరికత ఉన్నతంగా వుంది. ఉదాహరణకు పత్తి నూలుతో

బట్టలు నేయటం ప్రారంభించినవారు సింధు నాగరికులే. ఆ దశలో వారికి మాత్రమే ఆ పని సాధ్యమైంది. ఆటుపిమ్మట రెండు మూడువేల ఏళ్ళు గడిచిన పిమ్మట మాత్రమే పశ్చిమదేశాలవారు నూలుబట్టలు తయారు చేయ గలిగారు. పైగా సింధునాగరీకుల ఇళ్ళలో స్నానపు గదులున్నాయి. చక్కని వసతి సౌకర్యాలున్నాయి. భూగర్భ మురుగునీటి కాలువలున్నాయి. ఇలాంటి ఇళ్ళనిర్మాణం ఈజిప్టు, మెసపొటేమియాలలో గాని, మరొకచోట గాని జరగలేదు. ఈజిప్టులోను, మెసపొటేమియాలోను అద్భుతమైన ఆలయాలు రాజభవనాలు, సమాధులు నిర్మించారు. అందుకొరకు ధనాన్ని, శ్రమను విచ్చలవిడిగా వెచ్చించారు. కాని ప్రజలు మాత్రం మట్టిగుడిసెల్లో నివసిం చారు. సింధుప్రాంతంలో అలాజరగలేదు. ప్రజలు నివసించేందుకు చక్కని ఇళ్ళు నిర్మించుకున్నారు. పై గా ఒక ప్రత్యేక కళను సృష్టించుకున్నారు."

ప్రొఫెసర్ ఛిద్దే ఇలా ప్రకటించాడు: "సింధు నాగరికత విలసిల్లిన తావుల్లో వివిధరకాల వస్తువులను చేతివృత్తులవారు తయారుజేశారు. వర్త కులా వస్తువులను విదేశాలకు ఎగుమతి జేశారు. అందువల్ల సంపద పెరి గింది. కనుకనే సువిశాలమైన సకల సౌకర్యములు గల మూడంతస్తుల భవ నాలను వారు నిర్మించుకోగలిగారు. వాటితోపాటు బంగారు, వెండి నగలు, రత్నాలు, విలువైన పాత్రలు, శిల్పాలు, రాగితోను, కంచుతోను తయారు జేసిన ఆయుధాలు భూగర్భ శిథిలాల్లో కనుపించాయి. కనుక మొహంజొ దారో మున్నగు పట్టణాలలో ధనిక వర్తక సంఘాలుండేవని చెప్పవచ్చు. పైగా ఆ పట్టణాలలోని వీధులు, మురుగు కాలువలు, మంచినీటి కుళాయిలు స్నానపుగదులు మొదలగునవన్నీ ఒక ప్లాను ప్రకారం నిర్మించినట్లుగా కని పిస్తున్నాయి. మున్సిపల్ కౌన్సిల్ లాంటి అధికార సంస్థ లేనిచో అలాంటి పనులు సాధ్యమయ్యేవి కావు."

ఇలా ఎందరో ప్రముఖులు మెచ్చుకున్న సింధు నాగరికత భారత ఉపఖండంలో పడమరనుండి తూర్పుకు 1600 కిలోమీటర్లు, ఉత్తరంనుండి దక్షిణాదికి 1100 కిలోమీటర్లు గల ప్రాంతంలో విలసిల్లినట్లుగా ప్రొఫెసర్ బి.బి. లాల్ వివరించాడు. ఖచ్చితమైన సాక్ష్యాధారాలింతవరకూ లభించ నప్పటికీ సింధు నాగరికత విస్తరించిన ప్రాంతాలు మరికొంత తూర్పుగాను దక్షిణంగాను వుండవచ్చునని శాస్త్రవేత్తలు భావిస్తున్నారు.

ఆ కాలంలో మక్రాన్ తీరంనుండి, లోథాల్ వగైరా ఓడరేవుల నుండి ఇరాన్ మెసపొటేమియా వగైరా ప్రాంతాలకు ఎగుమతులు జరిగేవి. అటునుండి దిగుమతులు జరిగేవి. కనుకనే మొహంజొదారో మున్నగు చోట్ల దొరికిన సీళ్ళ (ముద్రల) వంటివి టైగ్రిస్, యూఫ్రటీస్ నదుల మధ్యగల ప్రాంతంలో చాలా కనుపించాయి. మెసపొటేమియా (సుమేరి యన్) వారి సీళ్ళు మొహంజొదారోలో కనుపించాయి. సింధు నాగరికులు తయారుజేసిన పూసలహారాలు క్రీట్ దీవిలో దొరికాయి.

సింధు నాగరికత భూమార్గాన తుర్క్మేనియా వరకూ వ్యాపించిం దని సోవియట్ స్కాలర్సు వి.యమ్. మాసన్, బి. ఎ. లిట్వినోస్కీ ప్రభృ తులు ప్రకటించారు. అల్‌తిన్‌తెపె, ఖాపుజ్‌తెపె, తొహెర్ భాయ్ తెపె, అనౌ లాంటిచోట్ల సింధు నాగరికుల పాత్రలు దంతపు బొమ్మలు, పూసల హారాలు, రాగివస్తువులు, కంచు పనిముట్లు సీల్సు చాలాదొరికాయి. తుర్క్మేనియాలో కనిపించిన పదమూడురకాల కుండలు కూజాలు హారప్పలో కనుపించిన వాటి మాదిరిగా వున్నాయని శ్రీ యస్. సి. చంద్రా, శ్రీ కృష్ణ దేవ ప్రకటించారు.

అక్కాడ్‌లో భారతీయ వర్తకుల కాలనీ ఒకటుండేదని వెల్లడైంది. అక్కడ లభించిన సాక్ష్యాధారాలుకూడా బహ్రీన్ మెసపొటేమియాలకు-

దిల్‌మున్, మాగన్, మెలూహాలకు మధ్య వాణిజ్య సంబంధాలుండేవని ఖచ్చితంగా తెలుసుకునేందుకు పనికివచ్చాయి. మాగన్ మెలూహాలు భారత ఉపఖండంలోనివేనని పలువురు స్కాలర్సు నిర్ణయించారు. కనుక భారత దేశానికి- ఇరాన్ ఇరాక్ తుర్కుమేనియా మున్నగు దేశాలతో ఆరువేల సంవత్సరాలక్రితమే వ్యాపార సంబంధాలుండేవని రుజువైంది.

"సింధునది లోయల్లో ఉరుకులు పరుగులతో విస్తరించిన పత్తిపంట, హరప్ప నాగరికతకు మూలం. పత్తినూలుతో తయారుచేసిన వస్త్రాలకు ఇరాన్, మెసపొటేమియాలనుండి గిరాకీ పెరగడంతో, పత్తి పంట బెలూచిస్తాన్‌నుండి సింధులోయకు వ్యాపించింది. అందువల్ల హరప్ప-మొహంజొదారో నాగరికతల సమ్మేళనం జరిగింది ... మెసపొటోమియాలో లభించిన వ్యాపార ఫలకాలలో, మెల్లూహానుండి సరుకులను దిగుమతి చేసుకున్నట్లుగావుంది. ఈ మెల్లూహా సింధులోయలోని పత్తి సామ్రాజ్యమే" అని ఖుర్షీద్ హసన్‌షేక్, సయ్యద్ యం. అనఫాక్ అనే పాకిస్తానీ పురావస్తు శాస్త్రవేత్తలు వ్రాసిన వ్యాసాన్ని "యునెస్కో" వారు ప్రచురించారు.

అయితే ఇంత గొప్ప నాగరికతను సృష్టించిన వారెవరు? అసురులా ? ఆర్యులా ? లేక మరొకరా ? అన్న విషయాన్ని ఖచ్చితంగా తేల్చవలసిన అవసరముంది. కొందరీ నాగరికత ఆర్యులదంటున్నారు. ద్రవిడులదని కొందరంటున్నారు. ముండా తెగలవారిదిగాని మరొకరిదిగాని కాకూడదా? అని కొందరు ప్రశ్నిస్తున్నారు.

సింధు నాగరికతా కేంద్రం "మెల్లూహా" అని పాకిస్తానీ పురావస్తు శాస్త్రవేత్తలు చెపితే, ఆ ప్రజలు "మలాల్కా"వారు అని భారతీయ పురా

వస్తు శాస్త్రవేత్త శ్రీ యస్. ఆర్. రావు చెప్పాడు. అయితే వారెవరు? ఆర్యులా? ఆర్యేతరులా?

## ముండా (కోల్) తెగలు

ఆస్ట్రో - ఆసియాటిక్ తెగలుగా పేర్కొనబడుతున్న వారిలో ముండా (కోల్) మాన్ మేర్ తెగలవారున్నారు - మధ్యప్రదేశ్‌లోని మాళ్వా ప్రాంతంనుండి నీగ్రిడ్సును నెట్టివేయ గలిగిన ముండా తెగవారు, అచటగల సారవంతమైన మైదానాలను ఆక్రమించారు. ఏడువేల ఏళ్ళక్రితం ముండా తెగవారు పశువుల మందలను పెంచారని, అటుతరువాత పోడు వ్యవసాయం ప్రారంభించారని చెప్పేందుకు తగిన సాక్ష్యాధారాలు లభించాయి.

ఐదువేల ఏళ్ళక్రితం ముండాతెగవారు, విస్తృతంగా వ్యవసాయం చేశారని, చెరుకు ద్రాక్ష పండించారని, డాక్టర్ వి. యస్. వకాంకర్ నిరూపించాడు. మొదట్లో వీరు పరిధాన్యం పండించారని, కొంతకాలం తర్వాత వర్షాలు తగ్గినందున గోధుమలు పండించడం ప్రారంభించారని కూడా డాక్టర్ వకాంకర్ వివరించాడు.

వ్యవసాయం చేయడంద్వారా పైచేయి సంపాదించిన ముండా తెగవారు క్రమేణా పలుప్రాంతాలకు విస్తరించగలిగారు. కనుక ఈ తెగకు సంబంధించిన పురాతన వస్తువులు, నివాస కేంద్రాలలాంటి వనేకం ఇటీవల కనుగొనబడినాయి. కాగా ముండా తెగలవారు పత్తినూలుతో బట్టలు నేశారని, మళ్వాప్రాంతానికి- హరప్ప మొహంజొదారో ప్రాంతాలకు మధ్య వ్యాపార సంబంధాలుండేవని వెల్లడైంది.

సింధు నాగరికులభాష ముండాతెగలవారికి తెలుసునని, బియ్యం టెంకాయ తాంబూలం సమర్పిస్తూ పూజలు చేసినవారిలో మొదటివారు ముండాతెగలవారేనని విజ్ఞులు విశ్వసిస్తున్నారు.

అయినా సింధు నాగరికులు సాధించిన పట్టణ నాగరికతను ముండా తెగలవారు సాధించలేకపోవడానికొక బలమైన కారణముంది. ఆనాడు మెసపొటేమియా ఇరాన్ వగైరా ప్రాంతాలతో జరిగిన సముద్ర వ్యాపారం, మధ్యాసియా ప్రాంతాలతో జరిగిన రహదారి వ్యాపారం సింధు నాగరికుల చేతుల్లో వుండేవి. కనుక ముండా తెగలవారు తమ వ్యావసాయక ఉత్పత్తులను సింధు వర్తకులకు (పణులకు) విక్రయించి, తమకు అవసరమైన వాటిని కొని తెచ్చుకునేవారు. పత్తినూలుతో వీరు నేసిన బట్టలు సహితం పణులకు విక్రయించవలసి వచ్చేది.

ఐదువేల ఏళ్ళక్రితం ఉపఖండంలోని వాయువ్యప్రాంతమంతా సింధు నాగరికుల అధీనంలో వుండేది. కనుక ముండా తెగలవారు ఉపఖండంలోని ఈశాన్య ప్రాంతాలగుండా మలయా వియత్నాముల వరకూ విస్తరించారు. అయినా వర్తక వాణిజ్యాలకు అవకాశం లేకపోయినందున, సింధు నాగరికులు నిర్మించినవిధంగా పట్టణాలనుగాని, ఓడరేవులనుగాని నిర్మించలేకపోయారు.

ఆర్యులు ఉపఖండంలోని తూర్పుప్రాంతాలకు విస్తరించిన పిమ్మట ముండాతెగల ఔన్నత్యం మరీ దిగజారిపోయింది. - ఇప్పుడు ముండా (కోల్) భాషను మాట్లాడుతున్నవారు. చోటా నాగపూర్ మధ్యప్రదేశ్, ఒరిస్సాలలో గిరిజనులుగా జీవిస్తోంటే, మాన్ ఖ్మేర్ భాషను మాట్లాడుతున్నవారు, ఖాసి, జయంతియా కొండప్రాంతాల్లోను, నికోబార్ దీవుల్లోను నివసిస్తున్నారు. కనుక సింధునాగరికత ముండాతెగల వారిదేనని చెప్పేందుకు వీల్లేదు.

# 20

# సింధునాగరికత ఆర్యులదా ?

సింధు నాగరికత ఆర్యులదేనని కొందరు పండితులు చెప్పారు. కొందరిప్పుడూ చెపుతున్నారు. ఆర్యుల జన్మభూమి ఆర్యావర్తమేనంటూ శ్రీ అవినాశచంద్రదాస్, శ్రీ అచ్యుతునిచలపతిరావు పుస్తకాలు వ్రాశారు. ఇదే అభిప్రాయాన్ని లార్డు ఎలిఫిన్‌స్టన్, మిస్టర్ మ్యూయిర్ కూడా వెలిబుచ్చారు. ఆర్యుల జన్మభూమి ఆర్యావర్తమైతే, సింధు నాగరికత ఆర్యులదేనని చెప్పవచ్చు. కాని ఆర్యుల జన్మభూమి భారతదేశం కాదని, లోకమాన్యతిలక్‌తో సహా పలువురు పండితులు ప్రకటించారు.

"ఇరాన్ ఆర్యులు తమ మూలస్థానమును 'ఆర్యానావేఇజా'ను గుర్తుంచుకున్నారు. కాని భారతదేశంలోని ఆర్యులు తమ మూలస్థానమును మర్చిపోయారు" అని శ్రీ రాహుల్ సాంకృత్యాయన్ 'ఋగ్వేద ఆర్యులు' అన్న గ్రంథంలో వ్రాశాడు.

"అహురామజ్దా అనే దేవుడు ఐర్యన వైజో, సుగ్ధ, మోరు, హప్త హిందు (సప్త సింధు) రంఘ మొదలగు పదహారు దేశాలను మానవ నివాసయోగ్యముగా చేశాడు. వాటిలో ఐర్యనవైజో స్వర్గతుల్యము" అని పార్సీల వెందిదాద్ గ్రంథంలో వుంది.

"ఐర్యన=ఆర్యులయొక్క, వైజో=బీజము అనగా మూలస్థానము" అని శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి అర్థం చెప్పాడు. అయితే ఈ ఐర్యనవైజో ఎక్కడున్నట్లు ?

"ఉత్తర ధృవమండలమే ఐర్యనవైజో" అన్నాడు కీ॥ శే॥ బాల గంగాధరతిలక్. ఉత్తర ధృవమండలంలో సంభవించిన హిమప్రళయంలో

చనిపోగా మిగిలిన ఆర్యులు దక్షిణాభిముఖంగా తరలివచ్చారని వివరిస్తూ, వేదములలోని ఉత్తర నివాసము (ఆర్కిటిక్ హోమ్ ఇన్ ది వేదాస్) అనే గ్రంథం వ్రాసారు. డాక్టర్ వారెన్ మున్నగువారు ప్రారంభించిన ఉత్తర ధృవమండల వాదాన్ని బలపరుస్తూ లోకమాన్యతిలక్ చూపించిన ప్రమాణాలలో ముఖ్యమైనవి:—

"ఉత్తర ధృవానికి సరిగా ఉత్తరాన ధృవ నక్షత్రముంది. ఉత్తర ధృవంవద్దకు వెళ్ళి చూచినవారికి ఆ నక్షత్రం సరిగా నెత్తిమీద సున్నట్లును, తక్కిన నక్షత్రములు దానిచుట్టూ గిరగిర తిరుగుతున్నట్లును కనుపిస్తాయి. అక్కడ ఖగోళంలోని ఉత్తరార్ధగోళం మాత్రమే కనిపిస్తుంది. దక్షిణార్ధ గోళం కనిపించదు. సూర్యుడుదయించిన ఆరునెలలకుగాని అస్తమించడు. అస్తమించిన ఆరునెలలకుగాని తిరిగి ఉదయించడు. అందువల్లనే అక్కడ ఆరు మాసములు పగలు, ఆరు మాసములు రాత్రి వుంటాయి. కనుకనే మన సంవత్సరం దేవతల కొకరోజు అని వైదికవాఙ్మయంలో వుంది."

"సూర్యుడుదయించడానికి నెలరోజులముందు దిక్చక్రము (హొరైజన్) వద్ద ఉషస్సు కనిపిస్తుంది. అది దిక్చక్రము చుట్టూ అరవై ఘడియల కొక పర్యాయం చొప్పున తిరుగుతుంది. కనుకనే ముప్పైమంది ఉషో దేవతలు (ఉషస్సులు) రోజుకొకరు చొప్పున దిక్చక్రముచుట్టూ తిరుగుతున్నారని మన పూర్వులు వర్ణించారు."-

"సూర్యుడస్తమించిన పిమ్మట 48 రోజులవరకూ సంజ వెలుగుంటుంది. తరువాత రెండున్నర నెలలకాలం సూర్యసంబంధమైన వెలుతురుండదు. కాని ధృవకాంతుల (పోలార్ లైట్సు) నుండి వచ్చే (పసిడి రంగు కాంతివలన కొంత వెలుతురుంటుందని కెప్టెన్ పిమ్ వివరించిన దాన్నిబట్టి చూస్తే, మన పూర్వులు ఉత్తరధృవాన్ని మేరువుగాను, బంగారు

కొండగాను వర్ణించడం సరియైనదేనని రుజువవుతోంది. కనుక ఆర్యుల జన్మభూమి ఉత్తర ధృవప్రాంతమనుటకు సందేహించనక్కరలేదు" అన్నారు లోకమాన్యతిలక్.

తిలక్‌గారి అభిప్రాయాన్ని పలువురు వ్యతిరేకించారు. ఉత్తరధృవం వద్ద ఆరునెలలు వెలుతురు ఆరునెలలు చీకటి వుంటాయని మన పూర్వులు సంహితా బ్రాహ్మణాలలోను ఇతిహాస పురాణాలలోను వర్ణించారు. కాని ఋగ్వేదంలో ఆ ప్రసక్తి లేదు.

"ఏకం వా ఏతద్దేవానామహః యత్సంవత్సరః" ఏది మనకొక సంవత్సరమో, అది దేవతల కొక్కదినము" అని తైత్తిరీయ బ్రాహ్మణంలో వుంది.

(తై. బ్రా. 3-9-22-1)

"మానవ సంవత్సరం దేవతల కొక పగలును ఒక రాత్రియు నగును. పగలు ఉత్తరాయణము. రాత్రి దక్షిణాయనము" (మనుస్మృతి-1-67)

ఉత్తర ధృవమండల వర్ణన, ఆర్యుల సంహితా బ్రాహ్మణాలలో నున్నట్లే, పారశీకుల (పార్సీల) వెందిదాద్ గ్రంథంలోను వుంది. "తైచ అయర మన్యస్తేయత్ యారే" అనగా ఏది మనకొక సంవత్సరమో, దానిని వారు (దేవతలు) ఒక దినముగా భావింతురు అని అర్థం.

(వెండిదాద్ ఫరార్డ్ 2 పేరా 40)

"అంతేగాని నెలదినము లెడతెగని ఉషస్సు వర్ణన ఋగ్వేదంలో లేదు. ధృవమండల వర్ణన సహితం ఋగ్వేదంలో లేదు. పార్సీల అవెస్థా గ్రంథంలోను లేదు. ఆర్యుల ఆదిమ నివాసం ఉత్తరధృవ ప్రాంతమైతే, దాని వర్ణనలు తప్పకుండా ఋగ్వేదంలో వుండేవి. కాబట్టి లోకమాన్య

తిలక్ మున్నగువారు లేవనెత్తిన వాదన సరియైనది గాదు" అని పలువురు విజ్ఞులు ప్రకటించారు.

"ఉత్తరధృవ మండల వర్ణనలు ఫిన్నిష్ మున్నగు ఉరల్-అల్టాయిక్ తెగలనుండి సిధియనులు, వారినుండి పారశీకులు (ప్రష్యనులు) భారతీయ ఆర్యులు తెలుసుకొని వుండవచ్చు. కనుకనే ఋగ్వేదంలో లేని వర్ణనలు సంహితా బ్రాహ్మణాలలో వున్నాయి" అని వివరించారు.

## యూరప్ ఖండ వాదన

వేల సంవత్సరాలనాటి మానవ అస్థిపంజరాలు యూరప్‌ఖండంలోని భూగర్భ శిథిలాల్లో దొరికాయి. వాటిలో కొన్ని పుర్రెలు ఆర్యుల తలలను పోలివున్నాయట. కనుక ఫ్రాన్సులోని "గాల్సు" పలుదేశాలకు విస్తరించారని వారిలో కొందరు ఆర్యులుగా ప్రసిద్ధి జెందారని కొందరు పండితులు వ్రాశారు. ఆ పుర్రెలు జర్మనుల మూలపురుషులవని మరికొందరు వ్రాశారు. "శబ్ద రూప శాస్త్ర దృష్ట్యా చూచినప్పుడు సంస్కృత భాష లిథూనియన్ భాష నుండి పుట్టినట్లుగా కనిపిస్తుంది. కాబట్టి ఆర్యన్ తెగల జన్మస్థానం లిథూనియా ప్రాంతమేనని చెప్పవచ్చు" అని కొందరు భాషా శాస్త్రవేత్తలు వివరించారు.

(ఆర్యన్ క్రాడిల్ అన్డ్ ఆరిజన్ ఆఫ్ ఆర్యన్సు)

## మధ్యాసియాఖండ వాదము

"వెందిదాద్ గ్రంథంలో వివరింపబడిన భూగోళ పరిస్థితిని బట్టి చూస్తే, ఇరానియనుల ప్రథమ నివాసం బాక్ట్రియా దేశమని చెప్పవచ్చు" అని జే. జి. రోడ్ ప్రకటించాడు.

"ఆర్యన్ తెగలవారు కాస్పియన్ సముద్రపు తూర్పుప్రాంతము నుండి పలు దిశలకు విస్తరించారు" అని ష్లెగల్ ప్రకటించాడు.

"కాస్పియన్ ప్రాంతమే ఆర్యుల జన్మభూమి. కనుకనే భారతీయ ఆర్యులు తాము కశ్యపబ్రహ్మ సంతానమని చెప్పుకుంటున్నారు. భూదేవికి 'కాశ్యపి' అనే పేరు పెట్టుకున్నారు" అని కొందరన్నారు.

"భారత జర్మనీ జాతుల మొదటి నివాసం అముదర్యా, సిర్‌దరియా నదుల ప్రాంతం" అన్నాడు స్పెగెల్.

"ఆర్యులు హిమాలయ పర్వతాలుదాటి సప్తసింధు దేశమునకు వెళ్ళి నట్లు కనిపిస్తోంది. అంతకుముందు వారు హిమగిరులకు ఉత్తరాన గ్రీకులు, రోమనులు, స్లావులు, జర్మనులు, కెల్టులు అనువారితో కలిసివున్నారు" అని బన్సెన్ ప్రకటించారు.

"భాషా శబ్దముల సాదృశ్యమునుబట్టి చూచినచో మధ్యాసియా లోని వొక ఉన్నత ప్రదేశంలో హైందవులు, పారశీకులు, గ్రీకులు. రోమ నులు, స్లావులు. జర్మనులు, కెల్టులు అని పిలువబడుతున్నవారి పూర్వు లందరూ కలిసివుండేవారని చెప్పవచ్చు" అన్నాడు మాక్సుమూలర్.

"ఆర్యులు హిందూకుష్ పర్వతములు దాటివచ్చి పంజాబును ఆక్ర మించారు" అని భాషా శాస్త్రవేత్తలయిన మాగ్డోవెల్, గోవెన్ ప్రభృతులు ప్రకటించారు.

"శకులు, యూనీలు, హూణులు, మంగోలియనులు మున్నగువారు మధ్యాసియానుండి వెడలి, హిందూదేశమునకు కొందరు, యూరప్ ఖండా నికి కొందరు వెళ్ళారు. ఆర్యన్ తెగలవారు కూడా అలాగే విస్తరించారు" అని పలువురు స్కాలర్లు చెప్పారు.

రష్యన్ మైదానాలనుండి బయలుదేరిన ఆర్యనులు కొంతకాలం పాటు మధ్యాసియాలో వున్నారని, తరువాత వారిలో కొందరు ఇరాన్‌లో ప్రవేశించగా, కొందరు సప్తసింధు ప్రాంతంలో ప్రవేశించారని కొందరు శాస్త్రవేత్తలు చెప్పారు.

ఇటీవల రష్యాలోని దక్షిణ ఉరల్సు ప్రాంతంలో జరిపిన త్రవ్వకాలలో ఒక ప్రాచీన నగరం బయటపడింది ఇది ట్రోయ్, మొహంజొదారోలకన్నా కనీసం వేయి సంవత్సరాల ముందు నిర్మింపబడినట్టిదని. గెన్నెడీ జ్ఞానోవిచ్ అనే శాస్త్రవేత్త ప్రకటించాడు. ఈ నగరం ఆర్క్యేయ పర్వతం ప్రక్కన వుందిగనుక దీనికి ఆర్క్యేయం అని పేరుపెట్టారు. ఈ నగరంలో దొరికిన మృణ్మయ పాత్రలపై స్వస్తిక్ గుర్తులున్నాయట. ఆ పురాతన నగరవాసులు సూర్యుణ్ణి ఆరాధించినట్లుగా తెలుస్తున్నదట.

మొహంజొదారో నగరంకంటే వేయిసంవత్సరాలముందు ఆర్క్యేయ నగరం నిర్మింపబడిందా? లేదా? అనే చర్చ మనకిపుడక్కర్లేదు. సింధు నాగరికత ఆర్యులదా? ఆర్యేతరులదా? అన్న విషయాన్ని మాత్రమే మనమిపుడు నిశితంగా పరిశీలించవలసివుంది. కాబట్టి ఇండో-యూరోపియన్ తెగల విస్తరణ ఎలా జరిగిందో చూదాం-

"ఇప్పటివరకూ భూగర్భశిథిలాల్లో దొరికినవాటినిబట్టి చూస్తే, నాలుగు వేల ఏళ్ళక్రితం ఇరాక్ దేశపు ఉత్తరభాగంలో ఆర్యనులు ప్రవేశించినట్లుగా తెలుస్తున్నది. ఆర్యనుల కదలికకు సంబంధించిన తొలి సమాచారమిదే" అని శ్రీ .బి.కె. థాపర్ ప్రకటించాడు.

"నాలుగువేల ఏళ్ళక్రితం యూఫ్రటీస్ నది ఎగువ ప్రాంతంలోను, ఆసియా మైనర్‌లోను పరిపాలన నెలకొల్పిన హిట్టైటులు, రెండువేల ఎనిమిది వందల ఏళ్ళక్రితం బాబిలోనియాను పాలించిన కాస్సైటులు (రథాలను లాగేందుకు గుర్రాలను ఉపయోగించినవారిలో ప్రథములు) భారతీయఆర్యులు ఒకే శాఖకు చెందినవారు" అని శ్రీ బి. కె. థాపర్ ప్రకటిస్తూ, తన నిర్ణయానికి మద్దతుగా యాకోబి, పార్గిటర్, ఎడ్వర్డ్ మేయర్, హూసింగుల అభిప్రాయాలను జోడించాడు.

"క్రీస్తుపూర్వం 1595లో హిట్టైటులు బాబిలోనియాను ఆక్రమించారు కాని క్రీస్తుపూర్వం 1250లో అస్సీరియనులు హిట్టైటుల నోడించి బాబిలోనియాను స్వాధీనం చేసుకున్నారు" అని కొందరు చరిత్రకారులు చెప్పారు.

"నాలుగువేల ఏళ్ళక్రితం హిట్టైటులు ఇరాక్‌లోని ఉత్తరప్రాంతంలో ప్రవేశించగా, మూడువేల ఐదువందల ఏళ్ళక్రితం అర్యానా ప్రాంతంనుండి బయలుదేరిన ఆర్యనులు సప్తసింధు ప్రాంతంలో ప్రవేశించారు" అని పలు పురాశాస్త్రవేత్తలు ప్రకటించారు.

మూడున్నరవేల ఏళ్ళక్రితం ఆర్యనులు సప్తసింధు ప్రాంతంలో ప్రవేశించినప్పుడు వారిని స్థానికులు 'అరి' అని సంబోధించేవారు. కనుకనే ఋగ్వేదకాలంలో 'అరి' అనగా పరదేశి, ఆగంతకుడు, అతిథి అనే అర్థాలుండేవి. కాని ఆర్యులకు ఆర్యేతరులకు మధ్య పోరాటాలు ప్రారంభమైన పిమ్మట 'అరి' అనగా శత్రువు, పన్ను, చక్రము అనే అర్థాలు కలిగాయి. పాణిని కాలంలో 'అరి' అనగా వైశ్యుడు, అర్య అనగా పండితుడు, బ్రాహ్మణుడు అనే అర్థాలుండేవి. ఈ అరిశబ్దమే క్రమంగా అర్యశబ్దంగా మారిందని కొందరు విజ్ఞులు వివరించారు.

"అర్" అనే ధాతువునుండి అర్యశబ్దం పుట్టిందని "అర్" అనగా నాగలి అనే అర్థంకూడా కలదని నిఘంటువులు తెలుపుతున్నాయి. ఏ అర్థం ఎలా వచ్చినప్పటికీ, అర్యానానుండి వచ్చి సప్తసింధు ప్రాంతంలో స్థిరపడినవారికి "ఆర్యనులు" అనే పేరు కలిగినమాట మాత్రం నిజం. ఈ ఆర్యనులే కాలక్రమేణా ఆర్యులుగా ప్రసిద్ధిజెందారు.

అర్యానా ప్రాంతానికి "అరియా", ఇరాన్ అనే పేర్లుకూడా కలవని పారశీకుల (పార్సీల) గ్రంథాలు తెలుపుతున్నాయి.

కొంతకాలంపాటు పారశీకులు ఆర్యనులు ప్రక్క-ప్రక్కనే నివశించి నట్లుగా రుజువైంది. కనుకనే వారు నివసించిన దేశానికి పర్షియా, ఇరాన్ అనే పేర్లు కలిగాయి.

పారశీకుల (పార్సీల) జెంద్అవెస్తాలోని భాష, ఋగ్వేద భాషకు దగ్గరగా వుంది. ఋగ్వేదంలోని అనేక శబ్దాలకు, జెంద్అవెస్తాలోని శబ్దాలకు పోలికలున్నాయి. కొన్నిశబ్దాలలో సకార హకార భేదము, కొన్ని శబ్దాలలో కాస్త వర్ణభేదము వున్నప్పటికీ, కొన్ని శబ్దాలలో భేదమేమాత్రమూ కన్పించదు. ఉదాహరణకు:

| | | |
|---|---|---|
| వివస్వంతుడు | — | వివంఘతుడు |
| దేవ | — | దేవ |
| ఇంద్ర | — | ఇంద్ర |
| సప్త | — | హప్త |
| సింధు | — | హిందు |
| అసుర | — | అహుర |
| మన్యస్తే | — | మైన్యస్తే |

ఇలాంటి పోలికలుగల శబ్దము లనేకమున్నాయని శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి వివరించారు.

ఆర్యనులు పారశీకులు మాత్రమేగాక గ్రీకులు, రోమనులు, స్లావులు, జర్మనులు మున్నగువారందరూ ఒకే ప్రాంతంనుండి పలుప్రాంతాలకు విస్తరించారని భాషాశబ్ద శాస్త్రవేత్తలు ప్రకటించారు. అందుకు ఆధారంగా గ్రీకు, లాటిన్, జర్మన్, రష్యన్, ఇంగ్లీష్, సంస్కృత భాషల్లోని శబ్దములకు గల పోలికలను చూపించారు. శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి రచించిన సంస్కృత వాఙ్మయ చరిత్రలో ఈ క్రింది పోలికలు కన్పిస్తున్నాయి.

| సంస్కృతం | లాటిన్ | గ్రీక్ | జర్మన్ | ఇంగ్లీష్ |
|---|---|---|---|---|
| అస్తి | ఎస్ట్ | ఎష్టి | ఇష్ట్ | ఇజ్ |
| భరామి | ఫెరో | ఫెరో | బైరా | బేర్ |
| ద్వా | దువో | దువో | ట్వై | టూ |
| సప్త | సెప్టెమ్ | హెప్తె | సిబున్ | సెవెన్ |
| మానవః | మెన్సు | .... | మన్ | మాన్ |
| నవః | నోవుస్ | నోయ్ | న్యూఎ | న్యూ |
| పితా | పాటెర్ | పాటెర్ | ఫాటెర్ | ఫాదర్ |
| మాతా | మాటెర్ | మాటెర్ | ముట్టెర్ | మదర్ |
| భ్రాతా | ఫ్రాటెర్ | .... | బ్రూదెర్ | బ్రదర్ |
| నభః | నెబులా | నెఫోస్ | నెబులా | నెబులస్ |
| జనః | గెనుస్ | గెనోస్ | జినస్ | .... |

"బాస్కులు (పోర్చుగీసులు) తురుష్కులు, ఫిన్నిష్, మాగ్యారులు (హంగేరియనులు) మరికొందరు మినహా, ఇతర యూరోపియన్లు, పర్షియనులు, భారతీయ ఆర్యులు ఆర్యన్ తెగలకు చెందినవారే. పశువుల మందలను పెంచినప్పుడు వీరందరూ ఒకరికొకరు దగ్గరగా వుండేవారు. కనుకనే పశువుల పేర్లు ఈనాటికీ ఒకటిగా వున్నాయి" అని ఏంగెల్సు ప్రకటించాడు.

"భారతీయ ఆర్యులు భారత్-ఐరోపా పంశాలకు చెందిన "తూర్పు శతమ్" శాఖలోనివారు. ఈ శాఖలో ఇరానియన్లు, ఉక్రేనియన్లు కూడా వున్నారు. "పశ్చిమశతమ్" శాఖవారైన స్లావ్సులో రష్యనులు, జకొస్లొవేకియనులు మున్నగు వారున్నారు గ్రీకులు రోమనులు మొదలగువారు "సెంటెమ్" శాఖకు చెందినవారు. శతమ్‌శాఖ వారి 'శ' అను అక్షరాన్ని

సెంటెమ్ శాఖవారు 'క' అని ఉచ్చరించేవారు. సెంటెమ్ శాఖవారి 'ట' అను అక్షరాన్ని శతమ్‌శాఖవారు 'త' అని ఉచ్చరించేవారు. కనుకనే శతమ్ శాఖవారి 'సమితి' సెంటమ్ శాఖవారి 'కమిటీ' సమానమై ఒకే అర్థాన్నిస్తున్నాయి." అని శ్రీ రాహుల్ సాంకృత్యాయన్ వివరించాడు.

సంస్కృతంలో శతమ్ అనగా నూరు. లాటిన్‌లో సెంటెమ్ అనగా నూరు. ఈ లాటిన్ పదమే ఇంగ్లీషులో సెంచెరీగా మారింది. కనుకనే పర్సెంట్ అనగా శాతం అని అర్థమవుతోంది.

"భారత ఉపఖండంలో సప్తసింధు ప్రాంతమున్నట్లే, మధ్యాసియా ప్రాంతంలో కూడా ఏడునదుల ప్రాంతముంది. దీనికి రష్యన్ భాషలో 'సెమిరేచ్యే' అని పేరు. సెమిరేచ్యే అనగా ఏడునదుల ప్రాంతమని అర్థం." అని రాహుల్ సాంకృత్యాయన్ వివరించారు. సింకియాంగ్‌లో నివసించిన యూచీ (యూయి-ఛీ) ప్రజల భాషను నార్డిక్ (ఉత్తర) ఆర్యన్ భాషగా ప్రొ॥ లూడర్స్ పర్ణించాడు. గ్రీకుల పాలనలోనున్న బాక్ట్రియాను స్వాధీనము చేసుకున్న యూచీ తెగలవారు ఆఫ్ఘనిస్తానును జయించి భారత ఉపఖండంలో ప్రవేశించారని చరిత్రకారులు వ్రాశారు.

"వృధు, పర్శుగణాలు ఇరాన్‌లో కూడా వున్నాయి. సప్తసింధు ఆర్యులు-ఇరానియన్లు ఒకే వంశానికి చెందిన అన్నదమ్ముల లాంటివారు. కనుకనే ఇరాన్‌లో సూర్యమహిమను కీర్తించేవారు. ఒకప్పుడు రోమనులు కూడా మిత్రుని (సూర్యుని) ప్రార్థించేవారు. కనుక మిత్రమతానికి క్రైస్తవ మతానికి మధ్య పోటీ జరిగింది. రష్యనులు, ఇకొస్లొవేకియనులు క్రైస్తవ మతాన్ని స్వీకరించకముందు పరున (పెరున్) అనే పేరుతో వరుణుని ప్రార్థించేవారు. పారశీకుల దేవుడు వరుణుడే. క్రీ॥ శ॥ మూడో శతాబ్దం వరకూ ఆర్మేనియనులు అగ్నిని ఆరాధించారు." అని ఋగ్వేద ఆర్యులు అన్న గ్రంథంలో శ్రీ రాహుల్ సాంకృత్యాయన్ వ్రాశాడు.

"ద్యౌ= తండ్రి, పృథివి=తల్లి కనుక "ద్యౌ-పిత"రా భావం-చాలా పురాతన కాలంలోనే ఏర్పడింది. ఈ దేవతలు కేవలం శతమ్‌శాఖ వారైన ఆర్యులు, స్లావులు మున్నగువారికి మాత్రమే గాక, సెంటెమ్ శాఖ వారైన గ్రీకులు, రోమనులు మొదలైనవారికి కూడా పూజ్యులే. ద్యౌ= పితరౌ శబ్దమునకు రూపాంతరమే 'జూపిటర్' అన్నాడు శ్రీ సాంకృత్యాయన్.

ఇలా పలువురు శాస్త్రవేత్తలు, చరిత్రకారులు వెల్లడించిన అభిప్రాయాలు, చేసిన నిర్ణయాలు ఆర్యులు బయట నుండి వచ్చిన వారేనన్న సత్యాన్ని రుజువు చేస్తున్నాయి. కనుక భారత ఉపఖండంలో ఆర్యులు ప్రవేశించిన దెప్పుడో చూద్దాం.

## భారత ఉపఖండంలో ఆర్యుల ప్రవేశం

మూడువేల ఐదువందల ఏళ్ళక్రితం ఆర్యనులు అర్యనా ప్రాంతం నుండి బయలుదేరి సప్తసింధు ప్రాంతంలో ప్రవేశించారని పలువురు శాస్త్రవేత్తలు ప్రకటించారు.

ఆనాటి ఆర్యులు పశువుల కాపరులు. అంతేగాని వ్యవసాయదారులు కారు. కనుకనే పశుసంపద వృద్ధికొరకు వారనేక విధాలుగా ప్రయత్నించారు. తమ గోవులు, గోపాలురు సురక్షితంగా వుండాలని ఇంద్రుని ప్రార్థించారు. పణినామకాసురుని గోవులను, కృష్ణాసురుని గోవులను తెచ్చి తమ కప్పగించమని ఇంద్రుని వేడుకున్నారు. పణుల గోవులను, ధనాన్ని తన కప్పగించమని ఒక ఋషి సోముని ప్రార్థించాడు.

ఈ ప్రార్థనలు ఋగ్వేదంలో వున్నాయి. గొర్రెలను గురించి, ఉన్ని బట్టలను గురించి చెప్పిన మాటలనేకం వైదిక వాఙ్మయంలో వున్నాయి.

"ఋగ్వేదఆర్యులు బాగా చలిగావుండే ప్రదేశాలనుండి వచ్చారు. సువాస్తు మొదలగు ప్రాంతాలలో ఉపత్యక (పర్వతపాదము) లందు నివసించారు. అప్పుడు సప్తసింధు ప్రాంతంలో కూడా చలి ఎక్కువగావుండేది. కనుక వారు ముతక ఉన్నిబట్టలు ధరించేవారు. కాబట్టి అవిని (గొర్రెను) గురించి చెప్పిన మాటలు, వైదిక వాఙ్మయంలో మనకనేక చోట్ల కనిపిస్తున్నాయి." అని శ్రీ సాంకృత్యాయన్ వివరించాడు.

కనుక ఋగ్వేద ఆర్యులు మొదట్లో నూలుబట్టలు ధరించలేదని స్పష్టపడుతోంది. అలాంటివారు పత్తి పండించి బట్టలు తయారుచేశారని ఎలా చెప్పగలరు? బట్టలు వగైరా విక్రయ వస్తువులను ఉత్పత్తి చేయడం వల్లనే కదా సింధునాగరికత పెరిగింది? అయినా ఇక్కడ ఒక వాదన రావచ్చు.

"ఎనిమిదివేల ఏళ్ళక్రితం ఆర్యులు పశుపాలకులుగావున్నారు. అటు తరువాత వ్యవసాయాన్ని ప్రారంభించి పట్టణ నాగరికతను సృష్టించారు. కనుక ఆర్యులు మూడున్నరవేల సంవత్సరాల క్రితంవరకూ పశుపాలకులుగానే వున్నారని చెప్పడం తప్పు" అని ఎవరైనా వాదించవచ్చు.

ఈ వాదనను అంగీకరిస్తే ఆర్యులు ఏడువేల సంవత్సరాల క్రితం బలూచిస్థాన్‌లోను, కాలిబంగన్ మున్నగు ప్రాంతాలలోను పోడు వ్యవసాయం ప్రారంభించారని చెప్పవలసి వుంటుంది. కాని అది సాధ్యం కాని పని. ఎందువల్లనంటే?

సప్తసింధు ప్రాంతంలో స్థిరపడిన ఆర్యులు కాలక్రమేణా గంగా మైదానాల వరకూ విస్తరించారు. ఏడువేల ఏళ్ళక్రితం ఆర్యులు వ్యవసాయం ప్రారంభించి వుంటే, కనీసం ఐదువేల ఏళ్ళక్రితమైనా కురు-పాంచాల ప్రాంతంలో వ్యవసాయం ప్రారంభమై వుండాలి. కాని అలాంటిదేమీ జరగలేదని భూగర్భ పరిశోధనల వల్ల తెలుస్తున్నది.

## భూగర్భ పరిశోధనలు

రామాయణ భారత గాథలకు ఏమైనా చారిత్రక ఆధారాలున్నాయా? లేవా? అనే విషయాన్ని పరిశీలించేందుకు ఉత్తరప్రదేశ్ ఆర్కిలాజికల్ డిపార్టుమెంటు, జీవాజీ యూనివర్శిటీ, ఆర్కిలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా కలసి పెద్దఎత్తున త్రవ్వకాలు సాగించారు. భారత గాథకు సంబంధించిన మధుర, కురుక్షేత్రం, హస్తినాపురం ప్రాంతాలలోను రామాయణ గాథకు సంబంధించిన అయోధ్య, శృంగవరపురం మున్నగు చోట్లను జరిగిన త్రవ్వకాలలో రామాయణ, భారత గాథలను రుజువు చేయగల సాక్ష్యాధారాలు లభించలేదు.

నేటికి ఐదువేల ఏళ్ళక్రితం కురు-పాంచాల భూములు కీకారణ్యమయమని, మూడువేల నాలుగువందల ఏళ్ళక్రితం అక్కడ పట్టణ నాగరికత లేదని, రెండువేల తొమ్మిదివందల ఏళ్ళక్రితం పశుపాలకులు వ్యవసాయం ప్రారంభించారని చెప్పేందుకు తగిన సాక్ష్యాధారాలు లభించాయని శ్రీ జగత్పతిజోషి (ఆర్కిలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా) ప్రకటించాడు.

కనుక సింధు నాగరికత ఉన్నతస్థితిలో నున్నప్పుడు కురు-పాంచాల ప్రాంతాలు-ఆర్యుల ఔన్నత్యానికి కేంద్రమైన ప్రాంతాలు-కీకారణ్యమయమని స్పష్టపడుతోంది. సింధు నాగరికత ఆర్యులది కాదనే విషయాన్ని పురాణ గాథలుకూడా రుజువు చేస్తున్నాయి.

"శంబరాసురుని పురాలు (పట్టణాలు) హిమాలయాలలోని కాంగడా కాశ్మీరులోని కోట, జలంధర్ పరిసరాల్లో వుండేవి. శంబరాసురునకు - ఆర్యదివోదాసుకు మధ్య నలభై ఏళ్ళపాటు జరిగిన యుద్ధాలలో శంబరాసురుని పురాలు ధ్వంసమయ్యాయి. ఆ ప్రాంతాలను ఆర్యులు స్వాధీనం చేసుకున్నారు. కొంతకాలం జరిగినపిమ్మట, ఆయుద్ధాలను ఇంద్ర- వృత్రా

సురుల మధ్య జరిగిన యుద్ధాలుగాను, భవానీదేవికి - జలంధరునకు మధ్య జరిగిన యుద్ధంగాను పర్ణిస్తూ పురాణాలు వ్రాశారు" అని శ్రీ రాహుల్ సాంకృత్యాయన్ వివరించారు. త్రిపురాసుర సంహారం కూడా ఇలా వ్రాయ బడినదే.

ఇక్కడ గమనించవలసిన చారిత్రక విషయముంది. శంబరాసురునకు పురములున్నాయి. వాటిని దివోదాసు జయించి స్వాధీనం చేసుకోలేదు. ధ్వంసం చేశాడు. దేనికి? పట్టణ నాగరికతరు పశుపాలకులు ప్రబల వ్యతిరేకులు. పట్టణ నాగరికతకు ఆధారమైన వ్యవసాయం విస్తరించడం వల్ల, పశువుల మేతకు ఆధారమైన పచ్చిక మైదానాలు అంతరించిపోవడం పశుపాలకులకు కోపకారణమైంది. కనుక దానినొక జీవన్మరణ సమస్యగా తీసుకున్నారు. కలిసికట్టుగా తెగబడి దాడులు సాగించారు. మైదానాల్లో విస్తరిస్తున్న వ్యవసాయాన్ని ధ్వంసం చేశారు. తరువాత పట్టణాలమీద విరుచుకుపడి వెండి, బంగారాలు దోచుకొని, వాటిని ధ్వసం చేశారు. ఇలాంటి దాడులు చారిత్రకయుగంలో కూడా జరిగాయి. అత్తిలి, చెంఘిజ్‌ఖాన్ మున్నగువారి నాయకత్వాన తార్తారులు, మంగోలియనులు మొదలగు పశుపాలకులు విజృంభించి ఆసియా ఖండంలోనే గాక యూరప్ ఖండంలోని పట్టణాలను కూడా నేలమట్టం చేశారు.

దివోదాసు నాయకత్వాన ఋగ్వేద ఆర్యులు సాగించిన దాడులకు- అత్తిలి నాయకత్వాన తార్తారులు సాగించిన దాడులకు పోలికలున్నాయి. అయినా తమ ఆధిక్యత పెరుగుతున్నదశలో ఆర్యేతరుల నాగరికతను సంస్కృతిని స్వీకరించిన ఆర్యులు. వాటిని తమకు అనుకూలంగా మలుచుకొని అభివృద్ధిచెందారు. కనుకనే "ఆర్యుల ఆయుధబలం ఆర్యేతరులను

జయిస్తే, ఆర్యేతరుల సంస్కృతి నాగరికత ఆర్యులను జయించాయి"అని పలువురు విజ్ఞులు ప్రకటించారు.

ఆదిలో కేవలం పశుసంపద మీదనే కేంద్రీకరించిన ఋగ్వేద ఆర్యులు క్రమంగా వ్యవసాయాన్ని ప్రారంభించవలసివచ్చింది. పెరిగిన పశువుల మందలకు వేసవికాలంలో మేతను సమకూర్చడం కొరకు, ప్రజలకు అవసరమైన బార్లీ గోధుమ వగైరా పంటలను పండించడం కొరకు వ్యవసాయం తప్పనిసరి అయింది. కనుక ఆర్యేతరుల వ్యవసాయ పద్ధతులను ఆర్యులు అనుసరించారు.

"హరప్ప నాగరికత వృద్ధిపొందడానికి ముందే నాగలి వాడుకలోకి వచ్చింది. ఇటీవల జరిగిన పురావస్తు త్రవ్వకాలలో నాగటివాళ్ళు ఉన్న పొలం బయటపడింది. జనసమ్మర్దంగల నగరపోషణకు అవసరమైన మిగులు ఉత్పత్తులు నాగలివల్లనే సాధ్యమవుతాయి. కనుక వ్యవసాయమే సింధునగరాలకు ఆధారమైంది. నాగలితో వ్యవసాయం చేయడాన్ని ఆర్యులు స్థానికులనుండి నేర్చుకున్నారు. వైదిక వాఙ్మయంలో కనిపించే వ్యవసాయ సంబంధమైన పదాలన్నీ ఆర్యేతరులవే, లాఙ్గల. హల=నాగలి, కుద్దాల= పలుగు, ఖల= కల్లము, శూర్ప=చేట, ఉలూఖల=రోలు, పల్లి =చిన్న గ్రామము మున్నగునవి ద్రావిడ, ముండాభాషలలోనివి" అన్నారు సుప్రసిద్ధ శాస్త్రవేత్త డాక్టర్ రోమిలా థాపర్

ఆర్యులు వ్యవసాయంచేయడం స్థానికులనుండి నేర్చుకున్నారు. కనుక సింధు నాగరికత ఆర్యులది కాదని స్పష్టమవుతోంది. ఇలా చెప్పడానికి మరికొన్ని సాక్ష్యాధారాలు కూడా వున్నాయి.

"వేదం ఇరాన్‌లో ప్రారంభమైంది. కనుకనే ఋగ్వేదానికి-పార్సీల అవెస్తాకు దగ్గర సంబంధముంది. అలాంటి సంబంధం వేదానికి - పురాణాలకు మధ్యలేదు" అన్నారు పండిత జవహర్‌లాల్ నెహ్రూ-

"ఋగ్వేద ఆర్యుల చరిత్ర అర్యానా (ఇరాన్)లో ప్రారంభమైంది" అని సుప్రసిద్ధ చరిత్రకారుడు శ్రీ యస్. బి. రాయ్ ప్రకటించాడు.

మొహంజొదారో, హరప్ప మొదలగుచోట్ల జరిగిన త్రవ్వకాలలో ఆర్యుల పుర్రెలు, వారు తయారుచేసిన బూడిదరంగు మట్టికుండలు బహు కొద్దిచోట్ల మాత్రమే బయటపడ్డాయి. అవికూడా పట్టణ శిథిలాల పైపొరల్లో కన్పించాయి. అంతేగాని క్రిందిపొరల్లో కన్పించలేదు.

ఉత్తర మెసపొటేమియా, ఉత్తర ఇరాన్, పశ్చిమోత్తర పాకిస్థాన్ వగైరా చోట్ల శాస్త్రవేత్తలు కనుగొన్న ఆర్యనుల పుర్రెలనుబట్టి కూడా, భారత ఉపఖండంలో ఆర్యుల ప్రవేశం మూడున్నరవేల ఏళ్ళక్రితం ప్రారంభమైనట్లుగా రుజువవుతోంది. కనుక సింధు నాగరికతయొక్క క్షీణ దశ ప్రారంభమైన పిమ్మట మాత్రమే ఆర్యులు అక్కడ విస్తరించారని చెప్పవచ్చు.

సింధునగరాల అవశేషాలలో ఆర్మేనియన్ల పుర్రెలవంటి పుర్రెలు కన్పించాయని శ్రీ భూపేంద్రనాధదత్తా ప్రకటించారు. ఆ అవశేషాలలో కన్పించిన మట్టిబొమ్మలు నాలుగైదువేల ఏళ్ళనాటివని పురావస్తు శాస్త్ర వేత్తలు చెప్పారు. ఆ మట్టిబొమ్మల్లో కొన్ని సుమేరియనుల బొమ్మల లాంటివని సుప్రసిద్ధ శిల్పకళావేత్త డాక్టర్ కుమారస్వామి చెప్పాడు. కనుక సింధు నాగరికతకు కారకులైనవారిలో ఆర్మేనియన్లుకూడా ఉన్నారని ఊహించవచ్చు.

సింధు నాగరికతతో ఆర్యులకు సంబంధంలేదని శ్రీ జగత్పతిజోషి, డాక్టర్ శంఖాలియా, ప్రొఫెసర్ బి. బి. లాల్ వంటి శాస్త్రవేత్తలు చేసిన పరిశోధనలు రుజువుచేశాయి. కనుక మూడువేల ఐదువందల ఏళ్ళక్రితం భారత ఉపఖండంలో ఆర్యులు ప్రవేశించారని నిస్సందేహంగా చెప్పవచ్చు.

## రకరకాల వాదనలు

అయినా సింధు నాగరికత ఆర్యులదేనని చెప్పేందుకు కుయుక్తులు పన్నడం ఆగిపోలేదు. ఈ మధ్య డాక్టర్ పి. సి. కాశ్యప్‌గారొక వాదన లేవదీశారు.

"సట్లెజ్ నది కుడికట్టపైనగల 'నిర్మన్డ్' గ్రామానికి-రోపార్ వద్దగల 'తలపుర' గ్రామంతో సంబంధముంది. ఈ గ్రామం ప్రక్కనగల 'షిష్మా' వద్ద సింధు నాగరికులు నివసించారని చెప్పడానికి తగిన సాక్ష్యాధారా లున్నాయి. ఇక్కడగల పరశురామ- అంబికాలయంలో లభించిన రాగిరేకు పైనగల శాసనమునుబట్టి, సింధు నాగరికతకు కారకుడు పరశురాముడేనని చెప్పవచ్చు. యజ్ఞ యాగాది క్రతువులను సక్రమంగా నిర్వర్తించేందుకు కన్యాకుమారినుండి బ్రోచ్ వరకూ అనేక బ్రాహ్మణ కేంద్రాలను పరశు రాముడు స్థాపించాడు. వాటిలో కొన్ని కేంద్రాలు సింధునాగరికతకు నిలయ మైనాయి." అంటూ డా॥ కాశ్యప్ "సర్వైవింగ్ హరప్పన్ సివిలిజేషన్" అనే గ్రంథాన్ని వ్రాసి ప్రచురించాడు.

కాని డా॥ కాశ్యప్ చూపించిన శాసనమే ఆయన వాదాన్ని త్రోసి పుచ్చడానికి పనికొస్తోంది. సింధు నాగరికుల చిత్రలిపిని, లేఖలను ఇంతవర కెవరూ పూర్తిగా చదవలేక పోయారు. ఆ విషయంలో భేదాభిప్రాయా లున్నాయి. గౌతమ బుద్ధుని కాలంలోనూడా సమగ్రమైన లిపి రూపొంద లేదు. అయినా అంబికాలయంలోని శాసనాన్ని చూపించి, సింధునాగరికత ఆర్యులదేనని చెప్పడం హాస్యాస్పదం.

ఋగ్వేద ఆర్యులు విగ్రహారాధకులుగారు. వేదకాలంలో ఆలయ నిర్మాణం జరగలేదు. యజ్ఞవాటికల నిర్మాణం మాత్రమే జరిగింది. బౌద్ధుల స్తూప నిర్మాణానికి పోటీగా ఆలయ నిర్మాణం ప్రారంభమైంది. కాబట్టి

సింధు నాగరికతకుముందే అనగా ఏడెనిమిదివేల ఏళ్ళ క్రితమే పరశురామ-
అంబికాలయం నిర్మింపబడిందని ఎలా చెప్పగలరు?-

డా॥ కాశ్యప్ విశ్వసించే ఇతిహాస పురాణగాథలను పరిశీలిస్తే పరశు
రాముడు భార్గవుడని ఖచ్చితంగా తెలుస్తుంది. ఈ వంశానికి మూలపురుషు
డైన భృగుమహర్షి బ్రహ్మదేవునితిట్టి, తన అరికాలిలోని మూడో నేత్రాన్ని
శివునకు చూపించి, విష్ణుమూర్తి రొమ్ముమీద తన్నాడట. (ఈ కథ నమ్మ
దగినది కాదు. కాని భార్గవులెవరనే విషయాన్ని తెలుసుకునేందుకు ఇది
పనికొస్తుంది.)

భార్గవవంశంలో జన్మించిన శుక్రాచార్యుడు త్రిపురాసురులకు, బలి
చక్రవర్తిలాంటి ప్రముఖులకు గురువట. శుక్రాచార్యుని కుమారులు హిరణ్య
కశిపుని గురువులట. ఇదే వంశంలో జన్మించిన పరశురాముడు, కార్తవీర్యా
ర్జునునితో సహా క్షత్రియులనందరినీ ఊచకోత కోశాడట. అయినా పరశు
రాముడు ఆర్యుడేనని చెప్పేందుకు అవతారాల సిద్ధాంతాన్ని అడ్డంపెట్టారు.

పరశురాముడు విష్ణుమూర్తి అవతారమని, శ్రీరామునకంటే ముందు
జన్మించాడని దశావతారాలలో చెప్పారు. ఆయన శివుని ఆరాధించేవాడని,
శ్రీరాము నెదిరించి భంగపడ్డాడని రామాయణంలో వ్రాశారు. ద్వాపర
యుగంలో భీష్మునకు, కర్ణునకు విలువిద్య నేర్పాడని, అంబ వివాహ
విషయంలో భీష్మునిపై తలపడి నెగ్గలేక వెనుకకు తగ్గాడని భారతంలో
వ్రాశారు. ఇలా రెండున్నరవేల ఏళ్ళ తరువాత వెలువడిన గాథలకు—
ఆరువేల ఏళ్ళక్రితం ప్రారంభమైన సింధు నాగరికతకు ముడిపెట్టడం
హాస్యాస్పదం.

డాక్టర్ కాశ్యప్‌లాంటివారు మరికొందరున్నారు. భృగుతీర్థ, సురథ,
ప్రభాస, సుధామపురి మొదలగు పేర్లను చూపించి, సింధు నాగరికత

ఆర్యులదేనని చెపుతున్నవారున్నారు. ఆర్యుల ఆధిక్యత ఏర్పడకముందున్న సుత్కాజన్‌దార్, మాగన్, సుకోత్రడ, మక్రాన్, సోత్కాకోహ్, మెల్లాహా వగైరా పేర్లు మరుగునపడిపోయాయి. భృగుతీర్థ పేరు 'బ్రోచ్'గా మారింది. సురదపేరు సూరత్‌గా మారింది. ఇలా అనేక పేర్లు మారాయి - ఇంకా మారుతూనే వున్నాయి. బెజవాడ పేరును విజయవాడగా మార్చారు. బందరు పేరును బృందావన పురమని, కమ్మంమెట్టును స్తంభపురమని, ఒంటిమిట్టను ఏకశిలా నగరమని మార్చుటకు ప్రయత్నించారు. దేనికి? సంస్కృతీకరణకొరకు. ఇలాంటి మార్పులు చరిత్రను వక్రీకరించడానికి తోడ్పడతాయనే విషయాన్ని గుర్తించడం అవసరం.

సింధు నాగరికత ఆర్యులదేనని చెప్పేందుకు కొందరు పునర్దత్తుని కథను చూపుతోంటే, కొందరు అసమంజసుని కథ జూపుతున్నారు. ఈ కథలు ఎప్పుడు వ్రాయబడినవో నన్న విషయం పరికరక్కరలేదు. హరివంశం భారతం తరువాత రచించబడింది. సంస్కృత భారతంలో కనుపించని కృష్ణుడు భాగవతమంతటా కనుపిస్తున్నాడు. వేదాలలో కనుపించే కృష్ణుడు అసురుడు. ఇంద్రుని విరోధి. అంతేగాని ఆర్యుడు కాడు. అయినా, పుణ్యజన రాక్షసులు ఈజిప్టుకు ఎత్తుకుపోయిన పునర్దత్తుని శ్రీకృష్ణుడు విడిపించాడని, పుణ్యజనరాక్షసుల ఓడను నడిపినవారిపేర్లు, దిల్‌మున్ వారి పేర్లులా వున్నాయని, సింధు నాగరికత ఆర్యులదేనని చెప్పడానికి ఆ పేర్లువాలునని భావించడం సమర్థనీయంకాదు. అసమంజసుని కథకూడా పురాణ గాధలకు సంబంధించినదే. కనుక ఏవిధంగా జూచినా సింధునాగరికత ఆర్యులదికాదని ఖచ్చితంగా చెప్పవచ్చు-

# సింధు నాగరికత ద్రవిడులదా ?

సింధు నాగరికత ద్రవిడులదేనని హెరాస్, మకదేవసులు ప్రకటించారు. ఆవిషయంలో తుదినిర్ణయం జరగవలసివున్నదన్నారు శ్రీ ఎస్.వి. రాయ్. తరువాత కొన్నాళ్ళు గడిచాయి మరికొన్ని పరిశోధనలు జరిగాయి. ఈ నాగరికత ద్రవిడులదేనని డాక్టర్ పర్పోలా మున్నగు ఫిన్నిష్ శాస్త్ర వేత్తలు ప్రకటించారు. అందుకుగల కారణాలను వారిలా వివరించారు.

“సింధు నాగరికత ఆర్యులది కాదని తేలిపోయింది. ఆర్యేతరుల్లోని ముండా తెగలవారికంటే ద్రావిడులెక్కువ నాగరికత గలవారని, నౌకాయాన నిపుణులని చరిత్ర చెపుతోంది. ద్రావిడుల దేవుడైన శివుని రూపంగల సీళ్లు (ముద్రలు) మొహంజొదారోలో దొరికాయి. తమిళ భాషలోని అంత్య ప్రత్యయం, చతుర్థీవిభక్తి, షష్ఠీవిభక్తి మున్నగువాటినిబట్టి చూస్తే, సింధు నాగరికుల చిత్రలిపి ద్రావిడ భాషకు సంబంధించినదేనన్న అభిప్రాయం కలుగుతోంది. అంతేగాక తమిళ సాహిత్యం చాలా పురాతనమైనది గనుక సింధు నాగరికత ద్రావిడులదేనని చెప్పవచ్చు” అంటూ కంప్యూటర్ విశ్లేషణకు పూనుకున్నారు.

ఫిన్నిష్ శాస్త్రవేత్తల నిర్ణయాన్ని ప్రొఫెసర్ బి. బి. లాల్ త్రోసి పుచ్చారు. తమిళభాషలోని అంత్యప్రత్యయం, చతుర్థీవిభక్తి మున్నగువాటికి, సింధు నాగరికుల చిత్రలిపికి సంబంధమున్నదనే విషయం నమ్మశక్యం కాని దని సవివరంగా నిరూపించాడు. (వివరాలకు వివేకానంద కమ్మెమొరేషన్ వాల్యూమ్ చూడవచ్చు)

తమిళభాష చాలా పురాతనమైనదని చెప్పడంలో సహితం ఫిన్నిష్ శాస్త్రవేత్తలు పొరబడ్డారు. క్రీ॥శ॥ తొమ్మిదో శతాబ్దంలో ఇరియనార్ రచించిన తమిళ వ్యాఖ్యానగ్రంథంలో కన్పించే అభూత కల్పనలను జూచి తమిళ సాహిత్యం చాలా పురాతనమైనదని భ్రమపడ్డారు. ఇరియనార్ సృష్టించిన కట్టుకథలను విశ్వసిస్తే తమిళ సాహిత్యం పదకొండువేల ఏళ్ళక్రితం ప్రారంభమైందని చెప్పవలసి వుంటుంది. కాని తమిళ సాహిత్యం క్రీస్తుశకారంభంలో ప్రారంభమైందని కొందరు తమిళ పండితులతోసహా పలువురు పరిశోధకులు నిర్ణయించారు. కనుకనే సింధు నాగరికత ద్రవిడులదని చెప్పేందుకు అవకాశం లేదన్నాడు ప్రొఫెసర్ బి. బి. లాల్.

"ద్రవిడ శబ్దం సంస్కృత వాఙ్మయంలోగాని, తమిళ వాఙ్మయంలోగాని లేదు. క్రీస్తుశకం ఐదో శతాబ్దంవరకూ సంస్కృత ప్రాకృతభాషలతోపాటు తమిళభాషనుకూడా బ్రాహ్మీలిపిలోనే వ్రాశారు" అని శ్రీ కె. శ్రీనివాసరాఘవన్ ప్రకటించాడు.

అయినా సింధునాగరికత ద్రవిడులదేనన్న అభిప్రాయాన్ని సోవియెట్ స్కాలర్సుకూడా వెల్లడించారు. కనుక సింధునాగరికత విలసిల్లిన కాలంలో ద్రవిడులున్నారా ? వుంటే ఎక్కడున్నారు ? అని పలువురు ప్రశ్నించారు.

ఋగ్వేద ఆర్యులెంతవరకూ దాసప రాక్షసాది అసురులతో పోరాడి నట్లుగాను, కొన్ని సందర్భాలలో వియ్యమందినట్లుగాను తెలుస్తున్నదే గాని, ద్రవిడులతో పోరాడినట్లు గాని, వియ్యమందినట్లుగాని కన్పించటం లేదు. అసుర- దస్యు- దాస- యాతుధాన- క్రవ్యాద- మూరదేవ- రాక్షసులు అనార్యులని మాయలమారి దొంగలని ఋక్సంహితలో వర్ణించారు. అసుర- దైత్య- దైతేయ- దనుజ- దానవ- దితి

సుత పదములు సమానార్థకములని అమర కోశంలో వుంది. కిన్నర- గుహ్యక- సిద్ధ- భూత- పిశాచ- యక్షులతో పాటు రాక్షసులను కూడా అర్ధ దేవతల (డెమీ- గాడ్స్) జాబితాలో అమరసింహుడు చేర్చాడు. వానర తెగవారు ఇక్ష్వాకులతో చేతులు కలిపినట్టుగా రామాయణంలో వ్రాశారు. యక్షులు, గంధర్వులు, పాండవుల మిత్రులని భారతంలో వ్రాశారు. సంస్కృత భారతంలో కనుపించే పాంచాల- మగధ- విరాట- మద్ర- కేకయ- యాదవ- నిషాద- అసుర- దనుజ- నాగ- కిరాత మున్నగు వారిలో ద్రవిడులు లేరు కాని "ద్రవిడులు సంకీర్ణ జాతివారు" అని మన్వాది స్మృతులలో చెప్పబడిందని మహాభారత చరిత్రము అను గ్రంథంలో శ్రీ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి వ్రాశాడు.

ఆంధ్ర మహా భారతంలో పేర్కొన బడిన యాభై ఆరు జన పదముల్లో ద్రవిళ జనపదం కూడా వుంది. వీటిలో ఆంధ్ర జనపదం ఆంధ్రప్రదేశ్ లోనిది. కర్ణాట జనపదం కర్ణాట రాష్ట్రం లోనిది. పాండ్య జనపదం తమిళనాడు లోనిది. కేరళ మళయాళ జనపదములు కేరళ రాష్ట్రం లోనివి. కాగా ద్రవిళ జనపదమెక్కడిదో తెలియదు. కాబట్టి సింధునాగరికత ద్రవిడులదని ఎలా చెప్పగలరు? అనే ప్రశ్నకు సమాధానమేది?

## ద్రావిడు లెవరు?

ద్రావిడులనగా, "ద్రు- గతౌ" అను ధాతువును బట్టి, తరుమ బడిన వారని అర్థమవుతున్నదని, పరశురామునకు భయపడి పారిపోయిన క్షత్రియులే ద్రావిడులని భారతంలో వ్రాశారు.

"ద్రావిడులు ఆర్యులే. ద్రవిడ శబ్దం యొక్క పూర్వ రూపము "ధమిళ" ఇది ప్రాకృత పదము. ధమిళ అనగా ధర్మమును (బౌద్ధ ధర్మమును) అవలంబించిన దేశమని అర్థం. ధమిళ పదము నుండి ద్రమిళ- ద్రవిడ శబ్దములు పుట్టినవి." అని డా॥ చిలుకూరి నారాయణరావు వ్రాసిన వ్యాసం భారతిలో ప్రచురించ బడింది.

ద్రావిడులు ఆర్యులేనన్న వాదాన్ని ఈనాడెవరూ అంగీకరించరు. కాని, డా॥ నారాయణరావు చెప్పిన దాంట్లో కొంత సత్యముంది. క్రీస్తు పూర్వం మూడో శతాబ్దం నుండి, క్రీ॥ శ॥ మూడో శతాబ్దం వరకూ ఆరు వందల ఏళ్ళ పాటు, కంచికి దక్షిణాన నివసించిన ప్రజలు బౌద్ధ మతావలంబకులుగా వున్నారని చరిత్ర పరిశోధకులు చెప్పారు. "ధమిళ అనగా బౌద్ధ ధర్మమును అవలంబించిన దేశం" అని డాక్టర్ నారాయణ రావు ప్రకటించారు. కనుక ధమిళ శబ్దం నుంచి తమిళ- తమిళులు- తమిళనాడు అనే పేర్లు కలిగాయని ఊహించవచ్చు. అంతేగాని ద్రవిడులు ఆర్యులని చెప్పేందుకు వీల్లేదు.

మధ్యధరా సముద్రంలోని క్రీట్, ఈజియన్, ఆసియామైనర్ మున్నగు చోట్ల నివసించిన తెగలలోని వారు కొందరు, భారత ఉపఖండంలో ప్రవేశించి సింధు నాగరికతను సృష్టించారని, వారే ద్రవిడులని కొందరు పరిశోధకులూహించారు.

"ఆసియామైనరులోని "ట్రిమ్మిలి" తెగలను గ్రీకులు "టెర్మిలై" తెగలుగా పేర్కొన్నారు. టెర్మిలై అనే పేరు "ద్రమిజా" గా మారింది. ద్రమిజా అనే పేరు దక్షిణాదిన దమిజ్- తమిజ్- తమిళ్‌గా మారింది ద్రమిజా అనే పేరు ఉత్తరాదిన "ద్రమిళా"గా మారి, కొంతకాలం తరువాత "ద్రవిడ" గా మారింది" అని కొందరు భాషా శాస్త్ర వేత్తలు ప్రకటించారు.

వీరి అభిప్రాయమే గనుక నిజమైతే, నేటికి ఎనిమిదివేల ఏళ్ళ క్రితం ద్రావిడుల పూర్వులు భరత ఖండంలో ప్రవేశించి నాగరికతను సృష్టించిన వారై వుండాలి. అలా జరిగి వుంటే, ద్రమిజా- దమిళ్- ద్రమిళా- ద్రవిడ శబ్దాలు, తమిళ వాఙ్మయంలో గాని, సంస్కృత ప్రాకృత వాఙ్మయాల్లో గాని కనిపించక పోవటానికి కారణమేమిటి? అన్న ప్రశ్నకు సమాధానం లేదు.

## ద్రవిడ శబ్దం

కొందరు భాషా శాస్త్రవేత్తలు మరొక విధంగా చెప్పారు. "ద్రా-విద్" అనగా దక్షిణాన సంచరించిన వారనే అర్థముంది. కనుక ఉత్తరాది నుండి దక్షిణాదికి వచ్చిన వారిని "ద్రవిద్లు" అని ఆర్యులు పేర్కొన్నారు. ద్రవిద్లు అన్న మాట ద్రవిడులుగా మారింది." అని వివరించారు. ఇదే సరియైన వివరణ అని చెప్పవచ్చు.

ఉత్తరాదిన బౌద్ధం విస్తరిస్తున్న దశలో దక్షిణాదికి తరలి వచ్చిన బ్రాహ్మణులను కూడా ద్రవిడులు గానే పేర్కొనటం జరిగింది. ద్రవిడము అనగా దక్షిణ దేశము అని శబ్దార్థ చంద్రికలో వుంది. కనుకనే జగద్గురు శంకరాచార్యులు మున్నగు వారు ద్రావిడ బ్రాహ్మణులుగా ప్రసిద్ధి చెందారు. పుష్పద్రావిడ బ్రాహ్మణులు, ములికినాటి బ్రాహ్మణులు కూడా ఉత్తరాది నుండి దక్షిణాదికి వచ్చిన వారే. విద్యారణ్యులు, సాయణుడు ద్రావిడ బ్రాహ్మణులే. అనగా దక్షిణాది బ్రాహ్మణులన్న మాట.

## తెనుగు శబ్దం

తెనుగు శబ్దం కూడా ద్రవిడ శబ్దం లాంటిదే. ఈ రెండు శబ్దాలు ఒకే అర్థాన్నిస్తున్నాయి.

"తెన్+అగు= తెనగు అనగా దక్షిణమున నుండిన వారు లేదా దక్షిణాభి ముఖముగా సంచరించిన వారు తెనుగువారు. తెనుగు అనే మాట తెనుగుగా- తెలుగుగా మారింది. తెలంగాణము, తెలగాలు, తెలగాణ్యులు (బ్రాహ్మణుల్లో ఒక శాఖవారు) అనే పేర్లు కలిగాయి." అని ప్రొఫెసర్ ఖండవల్లి లక్ష్మీరంజనం ప్రకటించారు.

తెనుగు శబ్దం తెలుగు శబ్దంగా మారడానికొక కారణముంది. తెలంగ్= అనగా మెరక. కళింగ్= అనగా పల్లం. పల్లపు ప్రాంతాల్లో నివసించిన వారు కళింగులు. మెరక ప్రాంతమైన తెలంగాణాలో నివసించిన వారు తెలుగువారు. తెలుగువారు మాట్లాడిన భాష తెలుగు.

## కెయిరనులు

తెలంగాణాలో అనేక కెయిరనులు (ప్రాచీనకాలపు సమాధులు కనిపిస్తున్నాయి. ప్రజలు వీటిని రాక్షస గుడులంటున్నారు. ఇవి సిధియనుల సమాధులను పోలివున్నాయి. ఈ సమాధుల్లో వున్న కుండలమీద కన్పించే చిహ్నములు, మొహంజొదారోలోను, అత్యంత ప్రాచీన నాణెములమీదను కనిపిస్తున్న చిహ్నములను పోలివున్నాయని విజ్ఞులు చెపుతున్నారు. వీటిలో రాగిగిన్నెలు, మట్టికుండలు, కత్తి కొడవలి గొడ్డలి లాంటి ఆయుధాలు వున్నాయి. ఇవి మూడువేలఏళ్ళ నాటివని శాస్త్రవేత్తలు నిర్ణయించారు. కనుక సింధునాగరికతయొక్క క్షీణదశ ప్రారంభమైన పిమ్మట, కొందరక్కడనుండి దక్షిణ దిశకు తరలివచ్చి తెలుగునాట స్థిరపడ్డారని స్పష్టపడుతోంది. కాబట్టి తెలుగువారి పూర్వులకు సింధునాగరికతతో సంబంధమున్నదని చెప్పవచ్చు. కాని ఆంధ్రులకా సంబంధంలేదు.

## ఆంధ్రులు

ఆంధ్రులు తుషార (ఆర్మేనియన్) జాతితోపాటు అక్షు (అక్సస్) నదీతీరాలలో నివసించినట్లుగా వాయుపురాణంలో చెప్పబడింది. ఆర్మేనియన్

భాషలో "ఆంధ్రానిన్" అనగా అగ్రజుడు అని అర్థం. కనుక ఇతర ఆర్యన్ తెగలవలెనే ఆంధ్రులుకూడా మధ్యాసియానుండి వచ్చినట్లుగా విదితమవు తోంది.

ఉత్తర భారతంలో సరియైన నెలవులు లభించనందున ఆంధ్రులు కొంతకాలంపాటు వింధ్యపర్వతాలలోనున్న పుళిందులు మున్నగు పర్వత జాతులతో కలిసి నివసించారు. కనుక విశ్వామిత్ర మహర్షి పెట్టిన శాపం వల్ల, ఆయనగారి కొడుకులు యాభైమంది ఆంధ్ర పుండ్ర పుళింద మూతిబ శబర జాతుల వారైనారని ఐతరేయ బ్రాహ్మణంలో ఒక కథ వ్రాశారు. చివరకు ఆంధ్రులు దొంగలని వర్ణించడంకూడా జరిగింది. అశోక చక్ర వర్తి కూడా ఆంధ్రులను పుళిందులతో కలిపి "ఆంధ్ర పుళిందేషు" అని పేర్కొన్నాడు.

కాని అశోకుని తాతగారైన చంద్రగుప్తుని ఆస్థానంలో గ్రీకు రాయ బారిగావున్న మెగస్తనీస్ ఆంధ్రుల ఔన్నత్యాన్నిగూర్చి ఇలా వ్రాశాడు.

"ప్రబలశక్తి సమన్వితమైనది ఆంధ్రజాతి. వీరికి అసంఖ్యాకములైన గ్రామములు, ముప్పది నగరములు కోటలు గలవు. వీరి రాజునకు లక్ష కాల్బలము, రెండువేల గుర్రములు, వేయి ఏనుగులు కలవు"

మౌర్యచంద్రగుప్తుని కాలంనాటికే అంత ఔన్నత్యాన్ని సాధించ గలిగిన ఆంధ్రులు, ఆయన మనుమని కాలంనాడుకూడా పర్వత జాతులతో కలసి వింధ్య పర్వతాల్లో నివసించారనుకోవడం తప్పు.

కొందరు ఆర్యపండితులు, తమకిష్టంలేని ఆర్యులనుకూడా హీను లుగా చిత్రించారని తెలుసుకునేందుకు, ఐతరేయ బ్రాహ్మణంలోని కథ ఉప యోగపడుతుంది.

వింధ్య పర్వతాలలో కొంతకాలంపాటు నివసించిన ఆంధ్రులు చల్లగా కృష్ణా గోదావరీ తీరాలలో ప్రవేశించి రాజ్యాలు స్థాపించారు. కనుక సింధు నాగరికతతో ఆంధ్రులకు సంబంధంలేదని స్పష్టపడుతోంది కాబట్టి దక్షిణాదిన నివసిస్తున్నవారందరూ సింధునాగరికుల వారనుకోవడం పొరపాటు.

## సింధు లిపి

సింధు నాగరికులను స్పష్టంగా గుర్తించాలంటే, సింధు లిపిని తెలుసుకోవడం అవసరమని భావించిన విజ్ఞులు, సింధు లిపికి-తెలుగు తమిళం వగైరా దక్షిణాదిభాషల లిపులకు మధ్య ఏదైనా సంబంధమున్నదా ? లేదా? అని పరిశీలించారు.

"క్రీస్తుశకం ఐదో శతాబ్దంవరకూ సంస్కృత ప్రాకృత భాషలతో పాటు, తమిళ భాషనుకూడా బ్రాహ్మీ లిపిలోనే వ్రాశారు" అని శ్రీ కె. శ్రీనివాస రాఘవన్ ప్రకటించాడు.

"పూర్వ పల్లవ రాజుల కాలమందు తెలుగు-కన్నడ లిపి (వేంగి లిపి) తమిళ దేశమునందు వాడుకలో నుండెను" అని ప్రొ॥ కె. లక్ష్మి రంజనం చెప్పారు.

తెలుగు-కన్నడ లిపి, బ్రాహ్మీలిపినుండి పుట్టింది. బ్రాహ్మీలిపి ఎడమనుండి కుడికి వ్రాసిన లిపి. కాలిబంగన్‌లో దొరికిన కుండలమీదగల చిత్ర లిపి కుడినుండి ఎడమకు వ్రాసినట్టిదిగా స్పష్టపడింది. ఇటీవల ద్వారకవద్ద సముద్ర జలాల్లో దొరికిన మట్టికూజాపైనగల లిపికూడా కుడినుండి ఎడమకు వ్రాసినదే. కనుక సింధునాగరికుల చిత్రలిపితోగాని రేఖలతోగాని దక్షిణాది భాషల లిపులకు సంబంధంలేదని తేలిపోయింది.

అయినా ఒక భాషయొక్క పుట్టు పూర్వోత్తరాలను, ఇతర భాష లతో దానికిగల సంబంధాలను తెలుసుకునేందుకు కేవలం లిపిపైన మాత్రమే ఆధారపడకూడదు. కొన్ని భాషలు తమ పాత లిపులను విడనాడి కొత్త లిపులను స్వీకరించాయి. ప్రాచీన లిపుల్లో కొన్ని, కుడినుండి ఎడమకు, తిరిగి ఎడమనుండి కుడికి, నాగలి చాళ్ళవలె వ్రాయబడినాయి. కర్నూలు జిల్లా ఎర్రగుడిపాడులో కనిపించిన అశోకుని శాసనంలో కుడినుండి ఎడమకు, ఎడమనుంచి కుడికి చెక్కిన పంక్తులున్నాయి. చైనావారి లిపులు పైనుండి క్రిందికి వ్రాయబడినాయి.

ప్రాచీన భాషల్లో కొన్ని అంతరించిపోయాయి. అలాగే కొన్ని లిపులు కూడా కనుమరుగై పోయాయి. కనుమరుగై పోయిన లిపుల్లో కొన్ని ఇటీవల బయటపడినాయి. అయినా ఏమి లాభం? అవి ఏ భాషకు చెందినవో సన్న విషయం తేలడంలేదు. ప్రాచీన ఈజిప్షియనుల చిత్రలిపిని, షాంపో లియన్ అనే ఫ్రెంచి పండితుడు కొంతవరకూ పరిష్కరించగలిగాడు. కాని ప్రాచీన ఈజిప్షియనుల భాష తెలియనందున ఫలితం శూన్యమైంది. మరి కొంతకాలం గడచిన పిమ్మట మాత్రమే ఆ లిపి కోప్టుల లిపి అని తెలుసుకో గలిగారు. ఇటలీ ఆదిమవాసులైన ఇట్రుస్కనుల లిపికి, గ్రీకుల లిపికి మధ్య కొన్ని పోలికలున్నాయి. కనుక ఇట్రుస్కనుల శాసనాలను చదవడం సాధ్యమైంది. కాని ఇపుడు ఇటలీలో ఇట్రుస్కనులెవరో తెలియడంలేదు. వారి భాష అంతరించిపోయింది. అందువల్ల వారి శాసనాల అర్థాన్ని ఎవరూ తెలుసుకోలేకపోతున్నారు.

సింధులిపి విషయంకూడా ఇలాగే తయారైంది. ఈ లిపికి సంబం ధించిన గుర్తులుగల 2400 సీళ్ళను (ముద్రలను) శాస్త్రవేత్తలు కను గొన్నారు. (వీటిలో 800 వరకూ పశ్చిమాసియాలో కనుపించాయి.) ఇవి

గాక అనేక మట్టికుండలను, కూజాలను కనుగొన్నారు. వాటిమీద రకరకాల అలంకార రేఖలున్నాయి. అయినా వీటినెవరూ పూర్తిగా చదవలేకపోయారు.

మొహంజొదారో చిత్రలిపికి-బ్రాహ్మీలిపికి సంబంధంలేదని కొందరు పండితులు ప్రకటించగా, ఏదో కొంత సంబంధం వుండివుంటుందని మరి కొందరూహించారు.

నల్ల గొండజిల్లాలోని రాయగిరి ప్రాంతంలో బయటపడిన సమాధుల్లో కొన్ని బానలు కుండలు దొరికాయి. వాటిమీద మొత్తం 131 గీతలు గుర్తులు వున్నాయట. వాటిలో ఏడు గుర్తులకు-బ్రాహ్మీలిపి అక్షరాలకుమధ్య పోలికలున్నాయట. కనుక ఇది సింధులిపికి-బ్రాహ్మీ లిపికి మధ్య రూపొందిన లిపి కావచ్చునేమో? అని శ్రీ తిరుమల రామచంద్ర "మన లిపి పుట్టు పూర్వోత్తరాలు" అన్న గ్రంథంలో వ్రాశారు. అయినా దీన్ని తేల్చిచెప్పడం సాధ్యమవుతుందా?

పంజాబ్ రాష్ట్రంలోని టోపరావద్దగల శాసనస్థంభాన్ని, ఫిరోజ్ శాహ్ తుఘ్లక్ ఢిల్లీకి తెప్పించి, దాన్ని చదవడానికి పండితులను నియమించాడు. అయినా ఫలితం దక్కలేదు. అక్బర్ పాదుషా కూడా ప్రయత్నించాడు. కాని విఫలుడయ్యాడు.

చివరకు 1834లో ఈస్టిండియా కంపెనీ ఉద్యోగి జేమ్సు ప్రిన్సెస్ ఆ శాసనాన్ని చదివేందుకు పూనుకున్నాడు. కొన్ని పరిశోధనలు జరిగిన పిమ్మట కొంత దారి దొరికింది. ఇంతలో ఒకవైపు బ్రాహ్మీలిపి, మరో వైపు గ్రీకు లిపి ఉన్న నాణాలు బాక్ట్రియాలో దొరికాయి. ఆఫ్ఘనిస్తాన్‌లో మ్యాసన్ పండితునకు మరికొన్ని నాణాలు దొరికాయి. వాటిమీద ఒకవైపున గ్రీకులిపి, మరోవైపున ఖరోష్ఠి లిపి వున్నాయి. కనుక వాటి ఆధారంతో ఢిల్లీ స్తంభంమీదగల లిపి పాలీభాషకు సంబంధించిందేనని, జేమ్సు ప్రిన్సెస్ వివరించగలిగాడు.

కనుక సింధులిపి వివరాలను తెలుసుకోగలిగినప్పటికీ, ఆ చిత్ర లిపి ఏ భాషకు చెందినదోనన్న విషయం తెలియనంతవరకూ ఫలితముండదు. జేమ్సుప్రిన్సెస్‌కు లభించినట్లుగా ఒకే నాణెంమీద లేదా సీల్సుమీద ఇరు వైపులా రెండురకాల లిపులున్నవి దొరికితే కొంతదారి కన్పించవచ్చు. కాని అలాంటివేవీ ఇంతవరకూ దొరకలేదు. అందువల్ల సింధు నాగరికుల భాషను తెలుసుకునేందుకు భాషా శాస్త్రవేత్తలు పూనుకున్నారు.

# 50

# సింధునాగరికుల భాష

సింధు నాగరికతకు కారకులెవరనే విషయాన్ని స్పష్టంగా తెలుసుకునేందుకు భాషాశాస్త్రవేత్తలు అనేక పరిశోధనలు చేశారు. ఋగ్వేద భాష సంస్కృత భాషగా పరిణతి చెందిన వైనం స్పష్టంగా గ్రంథస్థమై వుంది. కాని ఇతర భాషల విషయంలో అలా జరగలేదు.

ఆర్యులు భరతఖండంలో ప్రవేశించకముందే సింధు నాగరికత పెంపొంది వుంటే, సింధుభాష కూడా బహుళ వ్యాప్తిలో వుండి వుండాలనే అభిప్రాయంతో పరిశోధనలు జేశారు. క్రీ॥శ॥ ఐవోశతాబ్దంలో సూత్రీకరించబడిన "తోల్‌హాప్పియమ్" పదకొండో శతాబ్దంలో వెలువడిన "ఆంధ్రశబ్ద చింతామణి"; పన్నెండో శతాబ్దంలో రచించబడిన "కర్ణాటకభాషా భూషణ"; పధ్నాలుగో శతాబ్దంలో రూపొందిన మళయాళ "లీలాతిలకం" లాంటి వ్యాకరణాల ఆధారంతో ముందుకు సాగారు.

పద్దెనిమిదో శతాబ్దంలో క్రైస్తవ మిషనరీలు వ్రాసిన చిన్న చిన్న వ్యాకరణాలతో పాటు యఫ్. కిట్టెల్ కన్నడంలోను హెచ్. గున్‌ధర్ట్ మళయాళంలోను, సి బ్రౌన్ తెలుగులోను రచించిన వ్యాకరణాలను, గ్రంథవివరణ పట్టికలను శాస్త్రవేత్తలు పరిశీలించారు. కాగా వారికి దక్షిణాది భాషల మధ్యగల సంబంధం అవగతమైంది. కనుక మరింత లోతుకు వెళ్ళారు.

తెలుగు, కన్నడ, తమిళ, మళయాళ భాషలను శోధించి 1856 లో కాల్డ్‌వెల్ రచించిన తులనాత్మక వ్యాకరణాన్ని మాత్రమే గాక, గదబ, కొలమి మున్నగు గిరిజన తెగల భాషలను అధ్యయనం చేసిన జె. బ్లాక్,

కె.వి. సుబ్బయ్యగార్ల రచనలను నిశితంగా పరిశీలించారు. పలు గిరిజన భాషలను అధ్యయనం చేసిన యస్. కోనోవ్ వెల్లడించిన అభిప్రాయాలను కూడా అర్థం చేసుకున్నారు. కనుక ఈ భాషలకు గల సారూప్యత వారికి అర్థమైంది. ఇవన్నీ ద్రావిడభాషా కూటమిలోనివేనని తేలిపోయింది. కాబట్టి ఈ భాషలకన్నింటికీ మూలమైన ప్రాచీనభాషను తెలుసుకోవాలనుకున్నారు. వారిదృష్టి పైశాచీ ప్రాకృతం వైపు మళ్ళింది.

పైశాచీ ప్రాకృతం పిశాచాలు మాట్లాడే భాషకాదు. అదొక ప్రాకృత భాషాభేదం మాత్రమే. ఒకప్పుడది సామాన్య ప్రజలు మాట్లాడిన భాష. అది మొరటుగా వున్నదనే అభిప్రాయంతో సంస్కృతపండితులా ప్రాకృత భాషకు పైశాచీ ప్రాకృతం అని పేరు పెట్టారు. అయినా దాని విలువ వెల్లడైంది.

## పై శా చీ ప్రా కృ తం

ఉపఖండంలోని పలు ప్రాంతాలలోనే గాక, సింహళంలో కూడా పైశాచీప్రాకృతం వ్యాపించిందని వివరిస్తూ శ్రీలక్ష్మీధరశాస్త్రి చేసిన ప్రకటన, వింధ్యకు తూర్పు దక్షిణ దిశల్లోని వివిధ ప్రాంతాల్లో పైశాచీ ప్రాకృతం విస్తరించిందని, పైశాచీ ప్రాకృతంతో పలువిధాలుగా పాలీ భాష ఏకీభవిస్తోందని వివరిస్తూ స్టెన్‌కోన్ వ్రాసిన వ్యాసం శాస్త్రవేత్తలకు కరదీపికలయ్యాయి. కనుక పైశాచీ ప్రాకృత మొకవైపున, ప్రాచీన పాలీ భాషకు ప్రోదిచేసిందని, మరొకవైపున ద్రావిడ భాషల్లోని తద్భవములకు మూలమైందని భావించారు.

"పైశాచీ ప్రాకృతమొకప్పుడు కేకయ దేశభాషగా వుండేది. పాణిని జన్మస్థలమైన తక్షశిల ప్రాంతంలో పైశాచీభాష ప్రజల వాడుక భాషగా వుండేది. కనుక పైశాచి భాషయొక్క రూపాంతరమే పాలీభాష అని

చెప్పవచ్చు." అని గ్రియర్సన్ ప్రకటించాడు. తన నిర్ణయానికి ఆధారంగా అనేకమంది లాక్షణికుల అభిప్రాయాలను ఉదహరించాడు.

(చూ: ఆర్.జి. భండార్కర్ కమ్మెమొరేషన్‌వాల్యూమ్ 119-123)

"పైశాచీ ప్రాకృతంతో సంబంధంగల భాషల్లో, నేటి ద్రావిడ భాషలకు మాతృకమైన ప్రాచీన ద్రావిడ భాషకూడా వుంది" అని ప్రొ॥ కాల్డ్‌వెల్ ప్రకటించాడు.

"మగధ, పాండ్య మున్నగు ప్రాంతాలలోని పైశాచీ భాషకంటే, కేకయ, శూరసేన పాంచాలములలోని పైశాచీభాష పరిశుద్ధమైనది" అని మార్కండేయ పండితుడు చెప్పాడు.

నాగవర్మయను కర్ణాటలాక్షణికుడు పైశాచీ ప్రాకృతపు వ్యాప్తిని వివరించాడు.

క్రీస్తు శకారంభానికి పూర్వం పైశాచీభాషలో గుణాఢ్యుడు రచించిన బృహత్కథ గనుక లభించి వున్నట్లయితే భాషాశాస్త్రవేత్తలకది ఉపయోగకరంగా వుండేది. కాని ఆ గ్రంథాన్ని మూర్ఖులైన సంస్కృత పండితులు నాశనం జేశారు.

గుణాఢ్యుడు ఆంధ్రప్రాంతంలో జన్మించాడు. ఆయనతల్లి బ్రాహ్మణ కన్య. తండ్రి నాగయువరాజు. ఉపఖండంలో అసంఖ్యాక ప్రజలుమాట్లాడుకునే ప్రాకృతంలో ఆయన తన బృహత్కథను రచించాడు. ఆ కథలోని వృత్తాంతముల ఆధారంతో భాస మహాకవి, ప్రతిజ్ఞాయౌగంధరాయణము, స్వప్న వాసవదత్త నాటకాలు వ్రాశాడు. వత్సరాజు కథను కాళిదాసు పేర్కొన్నాడు. దండి, భట్టి, బాణ, ధనంజయాది మహాకవులందరూ బృహత్కథను ప్రశంసించారు. ఇతిహాస పురాణాలలోని కథలకు తప్ప తక్కిన కథలన్నింటికీ మూలం బృహత్కథేనని మెచ్చుకున్నారు.

ఆ దశలో భారత రామాయణాల కున్నంత విలువ బృహత్కథ కుండేది. కనుక కొందరు పండితులా కథను సంస్కృతంలోకి అనువదించారు. తొమ్మిదో శతాబ్దంలో, నేపాల్ దేశీయుడైన బుధస్వామి అనువదించిన బృహత్కథా శ్లోక సంగ్రహంలో 4524 శ్లోకములున్నాయి. దీని తరువాత వెలుపడిన అనువాదం క్షేమేంద్రుని బృహత్కథా మంజరి. అటు పిమ్మట పదకొండో శతాబ్దంలో సోమదేవసూరి బృహత్కథను అనువదించి, ఆ అనువాదానికి "కథాసరిత్సాగరము" అని పేరుపెట్టాడు. వసుభాగ భట్టుని సంస్కృత పంచతంత్రం, బృహత్కథలోని కథల ఆధారంతో రచింపబడినదేనని, దుర్గసింహుడు తన కన్నడ పంచతంత్రంలో వెల్లడించాడు. కనుక పైన పేర్కొన్న కవులందరూ పైశాచీ ప్రాకృతంలో పండితులేనని స్పష్టపడుతోంది. పైగా క్రీస్తుశకం పన్నెండో శతాబ్దం వరకూ పైశాచీ ప్రాకృతంలో గుణాఢ్యుడు రచించిన బృహత్కథ పండితుల వద్ద వుండేదని కూడా విదితమవుతోంది.

అటుతరువాత గుణాఢ్యుని బృహత్కథను ధ్వంసంచేసి, దాని అనువాదమైన కథాసరిత్సాగరమును వెలుగులోకి తెచ్చారు. కనుక మూలం మాసిపోయింది. అనువాదం విస్తరించింది. కీర్తి యావత్తూ సోమదేవసూరికి దక్కింది.

గుణాఢ్యుడు సంస్కృత, ప్రాకృత భాషల్లో పండితుడు. అయినప్పటికీ అధిక సంఖ్యాక ప్రజలకు అర్థమయ్యే భాషలో ఆయన తన బృహత్కథను రచించాడు అనే విషయాన్ని స్వార్థపరులు కప్పిపెట్టారు. శర్వవర్మతో వేసిన పందెంలో ఓడిపోయిన గుణాఢ్యుడు తన ప్రతిజ్ఞ ప్రకారం సంస్కృత ప్రాకృత దేశభాషల్లో కాకుండా పైశాచీ ప్రాకృతంలో (పిశాచాలు మాట్లాడే భాషలో) రచనలు చేశాడని, ఆ రచనను శాతవాహన చక్ర

వర్తి తృణీకరించినందున, తన బృహత్కథను తానే చాలావరకూ తగల బెట్టాడని కథల్లి ప్రచారం జేశారు.

అయినా పైశాచిప్రాకృతాన్ని గురించి పలువురు పరిశోధకులు వెల్లడించిన అభిప్రాయాలను బట్టి కొన్ని వివరాలు తెలుస్తున్నాయి. వీటిలో (1)తెలుగు తమిళం మున్నగు భాషలకు మూలమైన ప్రాచీన ద్రవిడ భాషకు పైశాచీ ప్రాకృతంతో సంబంధముంది. (2) ద్రావిడ భాషల్లోని తద్భవములకు పైశాచీ ప్రాకృతమే మూలం. (3) పైశాచీ ప్రాకృతం యొక్క రూపాంతరమే ప్రాచీన పాలీ భాష (4) ప్రాచీన పాలీభాష నుండి మాగధి అర్వాచీన పాలీభాష పుట్టాయి.

కాబట్టి నాగులభాష పైశాచీ ప్రాకృత భేధమేనని చెప్పవచ్చు. కనుకనే ఆ భాష, ఏదో ఒక సమయంలో నాగుల పాలనలో గల కేకయ శూరసేన పాంచాల మగధ ఆంధ్ర పాండ్య సింహళాలలో వ్యాప్తి చెంది వుండవచ్చు. కాబట్టి సింధునాగరికుల భాష పైశాచీ ప్రాకృతం కాదని కొందరు, అవునని కొందరు అభిప్రాయ పడ్డారు.

కనుక ఎన్ని పరిశోధనలు జరిగినా సింధునాగరికుల భాష ఇదీ అని ఖచ్చితంగా ఎవరూ నిరూపించలేక పోయారు. ప్రాచీన ఈజిప్టు మెసపొటేమియాలలో జరిగినట్లుగానే, సింధునాగరికుల భాషకూడా అంతరించి పోయిందేమో? అన్న అనుమానాన్ని ప్రొ॥ బి. బి. లాల్ వ్యక్తం చేశాడు.

అయినా భాషా శబ్ద శాస్త్రవేత్తలు తమ కృషిని కొనసాగించారు. ద్రావిడ భాషల శబ్ద వ్యుత్పత్తి లక్షణ సంబంధమైన నిఘంటువును 1961లో టి.బర్రో, ఎం. బి. ఎమెనీవ్ ప్రచురించారు. యస్. భట్టాచార్యగారు ఒల్లరి కొండ, నాయకి భాషల వివరాలను ప్రచురించాడు. టి. బర్రో, యస్. భట్టాచార్య కలిసి పార్ధి, కుయి భాషల వివరాలను వెల్లడించారు. తెలుగు క్రియా

పదముల ఆధారములను శ్రీ బి. హెచ్. కృష్ణమూర్తి తెలియజేశాడు. 1970 లో డా॥ యం. అన్ద్రోనోవ్‌గారి 'ద్రవిడియన్ లాంగ్వేజెస్"అనే గ్రంథం వెలువడింది. ఇలాగే మరికొందరి రచనలు కూడా వెలువడినాయి. కనుక తెలుగు తమిళం మొదలగు భాషలతోబాటు, గ్రంథదశకు రాని మరో 24 భాషలు కూడా ద్రావిడ (దక్షిణాది) భాషా కుటుంబంలోనివేనని నిర్ణయించడం జరిగింది.

కాని, ఈ భాషలు మాట్లాడేవారు దక్షిణాదిన మాత్రమేగాక మహారాష్ట్ర. మధ్యప్రదేశ్, బీహార్, ఒరిస్సా రాష్ట్రాలలోకూడా వున్నారు. శ్రీలంకలోనూ వున్నారు. కనుక ద్రావిడ భాషలుగా నిర్ణయింపబడిన భాషలకు మూలమైన ప్రాచీనభాషను కనుగొనేందుకు ఫిన్నిష్, సోవియట్ శాస్త్రవేత్తలు కృషిజేశారు. ఆ కృషి 'బ్రహుయి' భాషను అధ్యయనం చేయడంతో ప్రారంభమైంది.

## బ్రహుయీ భాష

బ్రహుయీ భాషను మాట్లాడుతున్నవారు మధ్యాసియాలోవున్నారని డాక్టర్ బొంగార్డ్ లెవిన్ తెలియజేశారు. ఈ భాష మాట్లాడుతున్నవారు ఇరాన్ అఫ్ఘనిస్తానుల్లో కూడా వున్నారట. పాకిస్థాన్‌లోని కలాత్, హైర్‌పూర్, హైదరాబాదు జిల్లాల్లో బ్రహుయీభాషను మాట్లాడుతున్నవారు నాలుగు లక్షలకుపైగా వున్నారు.

బ్రహుయీ భాషకు - ద్రావిడభాషలకు సంబంధమున్నదని ఫిన్నిష్, రష్యన్ శాస్త్రవేత్తలు నిర్ధారణ చేశారు. వారు విడివిడిగా సాగించిన కంప్యూటర్ విశ్లేషణవల్లకూడా వారి నిర్ణయాలు సరియైనవేనని రుజువైందట, కనుక సింధునాగరికుల భాష "ప్రోటో-ద్రవిడియన్ భాష" అని

నిర్ణయించారు. అంతేగాక మూల ద్రావిడ భాషనుండి ఏయే కాలంలో ఏయే భాషలు చీలాయోనన్న వివరణకూడా ఇచ్చారు.

"ఆరువేల ఏళ్ళక్రితం ప్రోటో- ద్రవిడియన్ భాషనుండి బ్రహూయీ భాష చీలిపోయింది. 4500 ఏళ్ళక్రితం "కురుఖ్- మాల్టో భాష" చీలి పోయింది. 3500 ఏళ్ళక్రితం "గోన్డ్వానాగ్రూప్ భాషలు," వాటి వెనుక "కొలమి- పార్జి భాషలు" వేరుబడిపోయాయి. మూడువేల సంవత్సరాల క్రింతం తెలుగుభాష చీలిపోయింది. ఆ వెనువెంటనే తులుబాష చీలింది. క్రీస్తు శకారంభం వరకూ స్థిరంగావున్న ద్రావిడభాషనుండి కన్నడ భాష వేరుబడిపోయింది. షుమారు 900 ఏళ్ళక్రితం తమిళంనుండి మళయాళం చీలింది" అని డాక్టర్ యం. ఆన్ద్రొనోవ్ వివరించాడు.

అంటే హిమగిరులకు ఆవలపుట్టిన ఒక భాషా స్రవంతి క్రమ క్రమంగా పెరుగుతూ విస్తరిస్తూ పాయలు పాయలుగా చీలుతూ భారత ఉప ఖండంలోని వాయువ్యప్రాంతంనుండి కన్యాకుమారివరకూ ప్రవహించిం దన్నమాట-

మంచిదే. కాని సింధునాగరికుల భాష ప్రోటో- ద్రవిడియన్ (మూల ద్రావిడ) భాషయేనని అంగీకరిస్తే బ్రహూయీ, కురుఖ్, గోన్డ్వానా, కొలమి తోడా, కోయ, మున్నగు భాషలు మాట్లాడుతున్న గిరిజన తెగల కన్నింటికీ సింధు నాగరికతతో ఎంతోకొంత సంబంధమున్నదని కూడా అంగీకరిం చాలి. అంత గొప్ప నాగరికతకు కారకులైనవారు ఈనాడు అడవుల్లో గిరిజనులుగా జీవించడానికి కారణమేమిటో వివరించాలి.

పైగా ప్రోటో- ద్రవిడయన్ భాషకు - ఫిన్నిష్, హంగేరియన్, టర్కిష్, మంగోల్, మంచూమున్నగు ఉరల్- అల్తాయిక్ భాషలకు సంబం ధం వుండి వుండవచ్చునని శ్రీయుతులు ఎ. యఫ్. త్యాగరాజు, యం. బి.

ఎమెనీవ్ లాంటి శాస్త్రవేత్తలు వ్రాశారు. వారి అభిప్రాయాలకు ఆధారంగా కొన్ని ఉదాహరణలు కూడా చూపించారు.

సింధునాగరికుల భాష భారత- ఐరోపా భాషలలోనిదేనని, అది ఋగ్వేదభాష పరిణతికి తోడ్పడిందని ప్రముఖ పురావస్తు శాస్త్రవేత్త డా॥ యస్. ఆర్. రావు ప్రకటించారు.

సింధు నాగరికుల చిత్రలిపిని, రేఖలను కంప్యూటర్ల ద్వారా చాలా వరకు చదవగలిగామని, ఈ లిపికి- తమిళం కన్నడం వగైరా భాషలకు సంబంధ మున్నట్లుగా తెలిసి పోయిందని ప్రొఫెసర్ క్నొరొజోవ్‌మున్నగు రష్యన్ శాస్త్రవేత్తలు ప్రకటించారు.

ఆ ప్రకటనను డా॥ యస్. ఆర్. రావు విమర్శించాడు. సింధునాగరికుల సీల్సు (ముద్రల) మీద వున్న చిత్రాలు, రేఖలుకూడా స్వరసంబంధమైన (ఫొనెటిక్) విలువను కలిగి వున్నాయని, ఆ ధ్వనుల విలువను సోవియట్ శాస్త్రవేత్తలు విస్మరించి కంప్యూటర్ విశ్లేషణకు పూనుకున్నందున అసంగతమైన నిర్ణయాలు చేశారని చెపుతూ తన నిర్ణయాలనిలా వివరించాడు.

"ఇంతవరకూ లభించిన 2400 ముద్రల్లో 1800 ముద్రలను నేను జాగ్రత్తగా అధ్యయనం చేయగలిగాను ఇవి ఐదువేల ఏళ్ళనాటివి. ఇవి వాటి అంతరార్థాన్ని తెలియజేయగల (ఎపిగ్రాఫికల్లీ యూస్‌ఫుల్) ముద్రలు. వీటిమీదనున్న లిపి అక్షర క్రమానుసారంగాను, అక్షర సముదాయంగాను వుంది. ఆ అక్షరాలు ధ్వనులకు సంకేతాలు. ఆధ్వనులు ఋగ్వేద భాషకు తోడ్పడ్డాయి. ఋగ్వేదంలో పేర్కొనబడిన ఋషుల పేర్లు రాజుల పేర్లు కూడావాటిమీద కనిపిస్తున్నాయి. సింధు నాగరికుల మత విశ్వాసాలు వేదమతా

నికి బలం చేకూర్చాయని చెప్పడానికి తగిన సాక్ష్యాధారాలుకూడా లభించాయి. కనుక సింధునాగరికులు పూర్వద్రావిడులని చెప్పడం పొరపాటు. బహుశా వారు సిథియనులు కావచ్చు."

ఇలా ఒకదానితో మరొకటి పొసగని నిర్ణయాలు జరిగాయి. కనుక సింధునాగరికతను ద్రవిడుల పూర్వులు సృష్టించారా? లేక ఆర్యుల కంటే ముందు భారతదేశంలో ప్రవేశించిన మరొక భారత్-ఐరోపా తెగవారు సృష్టించారా? అన్న సమస్య వివాదాస్పదంగా తయారైంది.

ఇందుకు కారణం, ఇంతపరకూ లభించిన సీల్సు (ముద్రలు). ఇవే ముఖ్యమైనవి. ఇవి సింధునాగరికతకు ముఖ్య కేంద్రాలైన హరప్ప, మొహంజొదారో శిథిలపట్టణాల పై పొరల్లోను, ఆ నాగరికత విస్తరించిన ప్రాంతాల్లోను దొరికాయి. వీటిలో 800 వరకూ ఇరాన్ ఇరాక్ తదితర చోట్ల దొరికాయి. ఆ దేశాలవారి సీల్సుకొన్ని ఇక్కడ దొరికాయి. అంటే ఇవి సింధు నాగరికతకు మూలమైన వ్యవసాయం, పశుపోషణ, చేతి వృత్తులు పెరిగి, వర్తక వాణిజ్యాలు ప్రారంభమైన పిమ్మట తయారుచేయ బడినవని స్పష్టంగా తెలుస్తున్నది. సీల్సుతోపాటు కనుపించిన పుర్రెలు, దొరి కిన మృణ్మయపాత్రలు, మట్టిబొమ్మలు వగైరా కూడా ఆ దశలోనివే. అంతకుముందున్న వస్తువులు దొరకాలంటే హరప్ప, మొహంజొదారో శిథిలపట్టణాలలో త్రవ్వకాలను, వాటిక్రింది పొరలవరకూ సాగించాలి. కాని ఆ పని శాస్త్రవేత్తలకు సాధ్యంకావడం లేదు. కారణం? అట్టడుగు నుంచి విపరీతంగా పైకి తన్నుకువస్తున్న నీరు.

అయినా ఆఫ్ఘనిస్తాన్, బలూచిస్థాన్ ప్రాంతాల్లో ప్రారంభమైన పశు పోషణ, పోడువ్యవసాయం, రాజస్థాన్‌లోని కాలిబంగన్‌కు విస్తరించి పెంపొందిందని కాలిబంగన్‌నుండి హరప్ప మొహంజొదారోలకు విస్త

రించిందని తేలిపోయింది. అదే విధంగా కుమ్మరిసారె, బర్మా, (బౌ-డ్రిల్) వగైరా కూడా ప్రయాణించాయని స్పష్టమైంది. అటు పిమ్మట పట్టణ నాగరికతకు అవసరమైన వస్తూత్పత్తి, వర్తక వాణిజ్యాలు ప్రారంభ మయ్యాయని చెపుతున్నారు. అదంతా మూడు నాలుగు వేల ఏళ్ళ కాలంలో జరిగిన క్రమాభివృద్ధి కాబట్టి ఈ అభివృద్ధి క్రమంలో పలుతెగలకు సంబంధం వుండివుండాలి. ఇందుకు ఉదాహరణగా సుమేరియన్ నాగరిక తను చూడవచ్చు.

## సుమేరియన్ నాగరికత

ఏడువేలఏళ్ళక్రితం కొత్త రాతియుగంలో ప్రారంభమైన అభివృద్ధి కేంద్రాలు ఈజిప్టులో కన్పించాయి. సుమేరియన్ నాగరికతకు కేంద్రమైన మెసపొటేమియాలోను కన్పించాయి. సుమేరియన్లు పశువుల మందలను పెంచారని, క్రమంగా వ్యవసాయం ప్రారంభించారని తెలియజేసే సాక్ష్యాధారాలు లభించాయి. ఎవరీ సుమేరియనులు? వీరు తురానియన్ తెగలకు చెందినవారని కొందరు శాస్త్రవేత్తలు చెపితే, ద్రావిడతెగలకు చెందినవారని మరికొందరు చెప్పారు. వీరు ఏ తెగలకు చెందినవారైనప్పటికీ, ఎరుదు, ఉర్, ఉరక్ ఆలయాలను నిర్మించింది వీరేనని, బాణలిపి (క్యూనీ ఫారమ్) లో అక్షరాలు చెక్కారని శాస్త్రవేత్తలు ప్రకటించారు. ఈ లిపికి కీలలిపి అనే పేరుకూడా వుంది.

ఇలా అభివృద్ధి చెందుతున్న సుమేరియన్లనను 4360 సంవత్సరాల క్రితం సెమిటిక్ తెగలవారైన అక్కాడియనులు జయించారు. నాలుగు వేల ఏళ్ళక్రితం తూర్పుఇరాన్‌లోని 'ఈలమ్'వారు. అక్కాడియనులను జయించి, వారి ముఖ్యపట్టణమైన 'అగడ్'ను నేలమట్టంజేశారు. 3980 ఏళ్ళక్రితం బాబిలోనియన్లు విజృంభించి సుమేరియన్ నాగరికతా కేంద్రమైన మెసపొటేమియాతో పాటు, దానికి ఉత్తరంగావున్న అస్సీరియాను, ఈలమును

కూడా స్వాధీనం చేసుకున్నారు. 3600 ఏళ్ళక్రితం ఇండో-యూరోపియన్ తెగలకు (ఆర్యన్ తెగలకు) చెందిన హిట్టైయిటులు బాబిలోనియన్లను జయించారు. ఈ హిట్టైయిటులను 3940 ఏళ్ళక్రితం అస్సీరియన్లు జయించి బాబిలోన్‌ను స్వాధీనం చేసుకున్నారు. 2600 సంవత్సరాలక్రితం సిధియనులు బాబిలోనియన్లు, మెడోలు కలిసి అస్సీరియనుల సామ్రాజ్యాన్నితుడిచి పెట్టారు. ఇలా ఎన్నితెగల అధికారం ఏర్పడినప్పటికీ సుమేరియన్ నాగరికతతో పాటు వానిప్రక్కన ప్రారంభమైన ఈలం· బాబిలోన్ నాగరికతలు కూడా వర్ధిల్లాయి. కాబట్టి పైన పేర్కొన్న తెగలవారికందరికీ ఆ నాగరికతలతో సంబంధమున్నదని స్పష్టంగా తెలుస్తోంది గదా?

సింధు నాగరికత విషయంలో కూడా ఇలాగే జరిగివుండాలి. ఈ నాగరికతకు కారకులు పూర్వద్రావిడులని కొందరు చెపితే, భారత ఐరోపా వంశాలకు చెందిన తూర్పుశతమ్ శాఖలోని వారని, వారు ఋగ్వేద ఆర్యుల కంటే ముందుగా భారత ఉపఖండంలో ప్రవేశించారని మరికొందరు చెపుతున్నారు.

పూర్వద్రావిడు లెక్కడనుండి వచ్చారని ప్రశ్నిస్తే, వారు ఆసియా మైనర్‌నుండి వచ్చారని, 'ట్రిమ్మిలీ' తెగలకు చెందినవారని కొందరు శాస్త్రవేత్తలు చెపితే, పూర్వద్రావిడులు ఉరల్-ఆల్తాయిక్ తెగలకు చెందినవారని ఉరల్ పర్వత ప్రాంతాలనుండి వచ్చారని మరికొందరు శాస్త్రవేత్తలు చెప్పారు.

ఇంత ఎక్కువగా కాకపోయినప్పటికీ ఋగ్వేద ఆర్యులు ఎక్కడనుండి ఏ మార్గంగుండా వచ్చి, ఉపఖండంలో ప్రవేశించారనే విషయంలో కూడా అభిప్రాయభేదాలున్నాయి.

## ప్రాచీన చిత్ర లిపి

హరప్ప, మొహంజొదారో ప్రాంతాల్లో దొరికిన సీల్సు (ముద్రలు) మీదగల చిత్ర లిపి ఐదువేల సంవత్సరాలక్రితం రూపొందిందట. అది కుడి నుండి ఎడమకు వ్రాయబడిన లిపి. కొన్ని ముద్రలమీద జంతువుల బొమ్మలు, చిత్రలిపులు వున్నాయి. కొన్నిటిమీద వట్టి లిపులే వున్నాయి. మరి కొన్నిటిమీద సంఖ్యల గుర్తులు, ధ్వనులను తెలిపే గీతలు (రేఖలు) కూడా వున్నాయి. ఈ రేఖలే అక్షరాలని, ఇవి 396 వరకూ వున్నాయని తెలుస్తోంది.

ముద్రలమీద కన్పించే బొమ్మలు విచిత్రంగా వున్నాయి. ఒకే కొమ్ము గల ఎద్దులు, పెద్ద మూపురాలు గంగడోళ్ళుగల ఆబోతులు, ఏనుగులు, ఎనుబోతులు, పులులు, లేళ్ళు కనిపిస్తున్నాయి. మూడుమొనల కిరీటం ధరించిన యోగీశ్వరుని బొమ్మ, శివపశుపతిరూపంలా కనిపిస్తున్న బొమ్మ, పులితో మనిషి పోట్లాడుతున్నట్లుగా కనిపిస్తున్న చిత్రంలాంటివున్నాయి.

ముద్రలతోపాటు అనేక మృణ్మయ (మట్టి) పాత్రలుకూడా దొరికాయి. వాటిలో ఒక కుండమీద, పిల్లకు పాలుఇస్తున్న గొర్రెను చిత్రించారు. మరొకదానిమీద ఒక కోడి తన పిల్లలను జాగ్రత్తగా సాకుతున్నట్లుగా చిత్రించారు. చేపల బుట్ట, వల మోసుకుపోతున్న జాలరి మరొక దానిమీద కనిపిస్తున్నాడు. మట్టితో తయారుచేసిన స్త్రీల ప్రతిమలు, పూజా మందిరాల గుర్తులు, రాతివిగ్రహాలు కూడా కన్పించాయి.

లోథాల్‌వద్ద దొరికిన ఒక మృణ్మయ పాత్రమీద ఒక చెట్టు, ఆ చెట్టు మీద ఒక కాకి, కాకి నోట్లో మాంసపుముక్క, ఆ చెట్టుక్రింద ఒక నక్క చిత్రించబడ్డాయి. ఆ చిత్రమే పంచతంత్రంలోని కథకు మూలమై వుండవచ్చు. ఈ చిత్రంతోపాటు, బంకమన్నుతో ముద్రలను తయారుచేసి, వాటిని

కాల్చి గట్టిపరిచేందుకు అవసరమైన బట్టీ, లోథాల్ ఓడరేవు వద్ద కన్పిం చింది.

మెహర్‌ఘర్‌లో గుండ్రని సీల్సు (ముద్రలు) దొరికాయి. వాటిలో ఒకదానిమీద చక్కని అలంకార రేఖలమధ్య ఏడుచేపలు కనిపిస్తున్నాయి. అవి ఒకదాని తోకవెంట మరొకటిగా వలయాకారంలో కుడినుండి ఎడమకు తిరుగుతున్నాయి. మరొకదానిమీద పరుగిడుతున్న వృషభరాజం కనిపిస్తోంది. అదొక రేఖాచిత్రం.

వీటికంటే పురాతనమైన చిత్రలిపి, రేఖా చిత్రాలు కూడా వుండి వుండాలి. అలాంటివేవీ లేకుండా ఆదిమతెగలు జీవించాయని చెప్పలేము. కనుకనే గౌతమ బుద్ధునకు బ్రాహ్మి, ఖరోష్టి లిపులతోసహా 64 లిపులు తెలుసునని, లలితవిస్తరమనే గ్రంథంలోవుంది. ఇందులో కొంత అతి శయోక్తి వున్నప్పటికీ కొంత నిజంకూడా వున్నదని చెప్పవచ్చు.

ఈనాడు మనదేశంలో 25 లిపులకుపైగా వాడుకలో వున్నాయి. గ్రంథస్థదశకురాని భాషలు మాట్లాడుతున్న గిరిజనులకుకూడా కొన్ని గుర్తు లున్నాయి. బుద్ధునకంటే ముందు జన్మించిన పాణినికి మూడు లిపులు బాగా తెలుసునని, అప్పటికే కొన్ని గ్రంథాల రచనకూడా జరిగిందని తెలుస్తు న్నది. అసలు ఋగ్వేదంలోనే లిపిని గురించిన ప్రస్తావన వుంది.

"సప్త చ్ఛందస్సులు అక్షరాలతోనే రూపొందుతాయి. గాయత్రీ ఛందస్సుకు ఎనిమిది అక్షరాలు, త్రిష్టుప్ ఛందస్సుకు పదకొండక్షరాలు, జగతీ ఛందస్సుకు పన్నెండక్షరాలు వుంటాయి" (ఋ. 1-164-24)

కాని ఆ అక్షరాలు కనపడేవికావు, వినపడేవి. అంటే ధ్వనులన్న మాట. కనుకనే వేదాలను "శ్రుతులు" అన్నారు. అయినా వేదకాలంలోనే లిపి రూపొందినట్లుగా తెలుస్తున్నది.

"ఉతత్వః పశ్యన్ నదదర్శవాచం ఉతత్వః శృణ్వన్ నశృణోత్యే నామ్" (ఋ. 10-71-4)

"వేదవాక్కును కొందరు చూచీచూడరు. కొందరు వినీ వినరు" అంటే, వేదవాక్కును లిపిబద్ధం చేసినప్పుడేగదా, చూచీచూడరు అనే మాటకు అర్థం?

ఋగ్వేద ఆర్యులకు ఏదో ఒక లిపి తెలిసివుండవచ్చు. అయినా చాలా కాలంవరకూ వేదాలను గ్రంథస్థం చేయకుండా, కంఠస్థం చేశారు. పారశీకుల "జెంద్ అవెస్థా" విషయంలోకూడా అలాగే జరిగింది. సుమేరియన్లు రూపొందించిన బాణలిపిని, పర్షియన్లు మరింత సరళంజేసి, ప్రతిగుర్తూ ఒక ధ్వనిని తెలిపే అక్షరంగా నిర్ణయించారు. కాని జెంద్అవెస్థాను గ్రంథస్థం చేయలేదు.

పర్షియన్ల లిపిని అసురబనిపాల్ స్వీకరించి, మట్టితో తయారు చేసిన పలకలమీద అనేక విషయాలను వ్రాయించి - పలకలను బట్టీలో కాల్పించి-భద్రపరిచాడు. ఆ పలకలు ముప్పైవేల వరకూ వున్నాయట. వాటి మీద "గిల్‌గమేష్" గాథ, (జలప్రళయానికి సంబంధించిన గాథ) కూడా వ్రాయబడి వుంది. "ఇది ప్రపంచం మొత్తంమీద ముందుగా వెలసిన పద్య కావ్యం. చరిత్రను తెలిపే ఇతిహాసం" అని కొందరు పండితులు చెప్పారు. కాని అది నిజంకాదు. గిల్‌గమేష్ గాథకంటే అనేక శతాబ్దాలముందు ఋగ్వేదం రూపొందింది.

అసురబనిపాల్ భద్రపరచిన మట్టిపలకలు, సుమేరియన్; బాబిలోనియన్ నాగరికతలను గురించి తెలుసుకోవడానికి పనికొచ్చాయి. అలాగే సింధు నాగరికతను గురించి తెలుసుకోవడానికి పనికివచ్చే కథలు కొన్ని సంస్కృత వాఙ్మయంలో కనిపిస్తున్నాయి.

## కశ్యపబ్రహ్మ సంతానం

దితి, అదితి, దను, కద్రువ, వినత కశ్యపుని భార్యలు. దితికి దైత్యులు, అదితికి ఆదితేయులు, దనుకు దానవులు; కద్రువకు నాగులు; వినతకు గరుడులు పుట్టారని ఇతిహాస పురాణాలలో వ్రాశారు. ఇలా పుట్టిన వారందరూ అన్నదమ్ములే. కాని సవతుల బిడ్డలు.

కనుక దైత్యులు దానవులు వొకవైపున, ఆదితేయులు (సురలు) మరొకవైపున నిలబడి యుద్ధంచేశారట. ఆ యుద్ధంలో బలిచక్రవర్తి ధాటికు తాళలేక ఆదితేయులు కకావికలై చెట్టుకొకరు పుట్టకొకరు చొప్పున నక్కివుండగా, అదితిపుత్రుడు వామనుడు బలిచక్రవర్తిని వేడుకొని, మూడడుగుల నేలను దానంగా సంపాదించి, ముల్లోకాలను ఆక్రమించాడట. శుక్రాచార్యుడు వారించినా వినకుండా దానంచేసిన బలిచక్రవర్తి పాతాళానికి తొక్కివేయబడ్డాడట. ఇదొక కథ. ఈ కథకు ఆధారమైన వృత్తాంతం ఋగ్వేదంలో వుంది.

యయాతి ఆర్యుడు. దానవుల గురువుగా ప్రసిద్ధిచెందిన శుక్రాచార్యుని కుమార్తెను దేవయానిని పెళ్ళిజేసుకున్నాడు. తరువాత శర్మిష్ఠను వరించాడు. శర్మిష్ఠ వృషపర్వునికుమార్తె. వృషపర్వుడు దానవ చక్రవర్తి.

యయాతికి- దేవయానికి యదువు, తుర్వసుడు పుట్టారు. యయాతికి- శర్మిష్ఠకు ద్రుహ్యుడు, అనువు, పూరువు పుట్టారు. ఈ ఐదుగురి సంతానమే శాఖోప శాఖలుగా విస్తరించి, పంచజనులుగా ప్రసిద్ధి చెందారు.

"ఋగ్వేదంలో కనిపించే పంచజన శబ్దములు, సప్తసింధు దేశము నందచ్చటచ్చట నివసించిన యదు, తుర్వాశ, అను, ద్రుహ్యు, పూరువులనే ఆర్యగణాలను తెలుపుతున్నాయి" అని మాగ్డోనెల్, పార్గిటర్, అవినాశ చంద్రదాస్ ప్రభృతులు వివరించారు.

కనుక సప్తసింధు ఆర్యుల్లో దానవుల రక్తం కలదని తేలిపో తోంది. వీరి పితామహులు ఆర్యులని, మాతామహులు దానవులని తేట తెల్లమవుతోంది. అంతేగాక సప్తసింధు ప్రాంతంలో ఆర్యులు ప్రవే శించకముందే, అక్కడ దానవుల పాలన కలదని, దానవప్రముఖుల కుమార్తెలను పరిణయమాడడంద్వారా యయాతి తన బలాన్ని పెంచుకో గలిగాడని విశదమవుతోంది.

అలా ఆర్యులు కొంతకాలంపాటు దానవులతో సంబంధ బాంధ వ్యాలు నెరపిన పిమ్మట ప్రబలులై దానవుల భూభాగాలను ఆక్రమించి, వారిని దక్షిణాదికి తరిమివేసిన ఉదంతమే, వామనావతార కథకు ఇతి వృత్తమై వుండవచ్చు.

ఇలా ఆక్రమించిన ఉదంతాలు చరిత్రలో అనేకం కనిపిస్తున్నాయి. యాదవుల పాలనలోగల పచ్చికబీళ్ళలో పుల్లరి చెల్లించి పశువులను మేపు కున్న అభీరులు, కాలక్రమేణా ప్రబలులై యాదవుల రాజ్యాన్ని ఆక్రమించి, మహారాష్ట్రకు విస్తరించారు. ఇలాగే దానవుల కేంద్రాలను ఆర్యులు ఆక్ర మించారని చెప్పవచ్చు- "శంబరాసురుని నూరుపురములను- రాతి కట్టడ ములతో నున్నవాటిని- దివోదాసుడను యజమానునికి ఇంద్రుడు వశపరి చెను" అని ఋగ్వేదంలోవుంది. (ఋ 4-30-20 ) కనుక అసలు విషయం చక్కగా వెల్లడైంది.

రాతి కట్టడములతోనున్న నూరు పురములు (పట్టణాలు) శంబరా సురునకున్నాయి. అవి దివోదాసు వశమయ్యాయని ఋగ్వేదం చెపుతోంది. ఈ ఒక్క సాక్ష్యం చాలు. సింధు నాగరికత ఆర్యులది కాదని, అది అసు రులదని చెప్పడానికి.

(9)

సప్తసింధు ప్రాంతంలో యదు, పూరు, తుర్వశాదుల ఆధిక్యత పెరిగిన పిమ్మట, తృత్సుభరత గణాల ఆర్యులు భరతఖండంలో ప్రవేశించారు. వారి గురువు విశ్వామిత్రుడు. పంచనదులను దాటి కీకారణ్యాలను ఛేదిస్తూ, తృత్సు, భరతులను గంగానది మైదానాలలోకి నడిపించాడు "ఓ నదులారా! మదీయులైన భరతులు మిమ్ములను దాటిపోగలరు" అని విశ్వామిత్రుడు చేసిన శపథం ఋగ్వేదంలోవుంది. (ఋ. 3-33- 11,12)

ఈ భరతులే కౌరవ పాండవ వంశాలకు మూలపురుషులు. ఉపఖండానికి భరతఖండమని, దేశానికి భారతదేశమని పేరు రావడానికి కారకులు-

అటుపిమ్మట సదానీర (గండక్) నదీ ప్రాంతముకు వెళ్ళిన మాధవ విదేహుడు తన అనుచరులతో కలిసి పశ్చిమ బీహార్ ప్రాంతాలను ఆక్రమించినట్లుగా శతపథ బ్రాహ్మణం తెలుపుతోంది. విదేహులుగా ప్రసిద్ధి జెందిన వారు వీరే. వీరి తరువాత సౌదాసులు, మత్స్యులు మొదలగు ఆర్య గణాలవారు ప్రవేశించారు.

ముందుగా భరతఖండంలో ప్రవేశించిన ఆర్యులు, మూడువేల ఐదు వందల ఏళ్ళక్రితం పశుపాలకులుగా వచ్చారని, వారి పనిముట్లు ఆయుధాలు కూడా శిలలతోను, కొయ్యతోను, కంచుతోను తయారుచేయబడినట్టివని, అటు తరువాత వచ్చిన ఆర్యగణాలవారు ఇనుపములుకులు గల బాణాలతో సన్నద్ధులై వచ్చారని పలువురు పురావస్తు శాస్త్రవేత్తలు చెప్పారు. ఆంధ్ర గణాలవారు కూడా రెండవదశలో వచ్చినవారే.

కాబట్టి ఆర్యులు గంగా మైదానాలను ఆక్రమించినపిమ్మట మాత్రమే సింధునది దిగువ ప్రాంతాలకు విస్తరించారని చెప్పవచ్చు.

అలా విస్తరించిన దశలో ఆర్యులు వ్యవసాయం ప్రారంభించారు. ఇనుమును కరిగించి పోతపోయడం నేర్చుకున్నారు. ఇనుప పనిముట్లు, ఆయుధాలు, ఇనుపకర్రువేసిన నాగలి తయారయ్యాయి. ఇనుపకర్రుగల నాగలితో బీడుభూమిని దున్నడం, ఇక్ష్వాకులనుండి జనకుడు నేర్చుకున్నాడట. అలా వ్యవసాయం వృద్ధిపొందింది. చేతివృత్తులు పెరిగాయి. వర్తక వాణిజ్యాలు ప్రారంభమయ్యాయి. ఆర్య నాగరికత విస్తరించింది.

## ఆర్య - ఆర్యేతరుల సంబంధాలు

ఆ దశలో సహితం దైత్య దానవాది అసురులకు- ఆర్యులకు మధ్య యుద్ధాలు, ఆ దాన ప్రదానాలు, సంబంధ బాంధవ్యాలు కొనసాగాయి. కనుకనే అనేక కధలు గాధలు వెలువడ్డాయి. బృహస్పతి దేవతల గురువు. శుక్రాచార్యుడు దానవుల గురువు బృహస్పతి కుమారుడు కచుడు శుక్రాచార్యుని వద్ద మృత సంజీవనీ విద్య నభ్యసించాడట.

తారాచంద్రులమీద కత్తిగట్టిన బృహస్పతి పక్షాన దేవతలు పోరాడగా, చంద్రుని పక్షాన దైత్యులు పోరాడి దేవతల నోడించారట. ఇదొక కధ. మానవులమధ్య జరిగిన యుద్ధాన్ని సురా - సుర యుద్ధంగా వర్ణించి చరిత్రకు మసిపూశారు. ఇలాంటిదే మరొక కధ.

బ్రహ్మదేవుని కొడుకు పులస్త్యుడు, పులస్త్యుని కొడుకు కుబేరుడు. పులస్త్యుని శరీరమునుండి విశ్రవసుడు అవతరించాడట. అలా అవతరించిన విశ్రవసునకు నృత్త గీత, విద్యా విశారదలైన ముగ్గురు రాక్షస కన్యలను కుబేరుడు సమర్పించాడట. విప్రవరుడైన విశ్రవసుడు ఆ రాక్షస కన్యలకు గర్భాదానం చేశాడు. కనుక పుష్పోత్కటకు రావణ కుంభకర్ణులు, మాలినికి విభీషణుడు, బకకు ఖరుడు శూర్పణఖ పుట్టారు. పెద్దవారైన పిమ్మట రావణ కుంభకర్ణాదులు తపస్సుచేసి బ్రహ్మదేవుని మెప్పించి

వరాలు పొందారట. అయినా వారు రాక్షసులుగా ఘోరాకారులుగా చిత్రించ బడ్డారు. ఎందువల్ల? వారు రాక్షస స్త్రీలకు పుట్టారు గనుకనా? అయితే దానవ స్త్రీలకు పుట్టిన యదు- తుర్వశ- ద్రుహ్యు- అను- పూరువులు ఆర్యులెలా కాగలిగారు? కిన్నర, గుహ్యక, యక్షులతోపాటు రాక్షసులనుకూడా అర్ధ దేవతల జాబితాలో అమరసింహుడెందుకు చేర్చాడు? రావణాసురుని అన్న కుబేరుడెలా సురల అభిమానపాత్రుడై ఉత్తర దిక్కుకు అధిపతి కాగలిగాడు? ఆయన ధనంగలవాడు కనుకనా? ఈ ప్రశ్నలకన్నింటికీ ఒకే సమాధానం. అదే అవతారాల సిద్ధాంతం. మరొక సమాధానంలేదు. కనుక చరిత్ర మరుగునబడిపోయింది.

## పుణ్యజన రాక్షసులు

"హరప్పరాజ్యం, రెండు సన్నిహిత సాంస్కృతిక సంబంధాలు కలది కావచ్చును. ఉత్తరభాగంలోని దానవ సంస్కృతికి హరప్పకేంద్రమై వుండవచ్చు. దక్షిణ భాగంలోని రాక్షసరాజ్యానికి మొహంజొదారో రాజధానియై వుండవచ్చు. ఈ రెండు దేశాలవారూ శివ-పశుపతిని, ఆదిశక్తిని ఆరాధించారు." అని శ్రీ యస్. బి. రాయ్ ప్రకటించారు.

పుణ్యజన రాక్షసుల వ్యాపారకేంద్రం బహ్రీన్‌దీవిలో వుండేదని, బహ్రీనుకు-కధియవార్ ప్రాంతంలోని రేవు పట్టణాలకు మధ్య జరిగిన వర్తక వాణిజ్యాలలో పుణ్యజన రాక్షసులుపైచేయి సంపాదించారని కొందరు శాస్త్రవేత్తలు వివరించారు.

మూడువేల ఏడువందల ఏళ్ళక్రితం రేవు పట్టణంగా వున్న ద్వారక (కుశస్థలి) ప్రాంత వ్యాపారమంతా పుణ్యజన రాక్షసుల పెత్తనంలో వుండేదనే అభిప్రాయాన్ని శ్రీ యస్. ఆర్. రావ్ వెలిబుచ్చారు; అంటే పుణ్యజన రాక్షసులకు సింధు నాగరికతతో సంబంధమున్నదన్నమాట.

ఎవరీ పుణ్యజన రాక్షసులు. ఒకప్పుడు పుణ్యజన రక్షకులుగా పిలువబడినవారు వీరే. వర్తక వాణిజ్యాలలో నిమగ్నమైన పిమ్మట పుణ్యజన రాక్షసులుగా పిలువబడ్డారు. అయినా రాక్షసులనగా విద్వాంసులు అనే అర్థం ఇప్పటికీ కనిపిస్తూనే వుంది. కాని, ఇతిహాస పురాణములలో వీరిని దానవాదులతో చేర్చి, అసురులుగాను ఘోరాకారులుగాను చిత్రించడం జరిగింది.

## అసురులెవరు ?

కృష్ణునితో వియ్యమందిన బాణాసురుడు అసురుడు. కృష్ణుని కొడుకు నరకాసురుడు అసురుడు భారత్-ఐరోపావంశాలలోని వారైన పారశీకుల (ఇరానియన్ల)దేవతలు అసురులు. అసురశబ్దం పారశీక భాషలో 'అహుర' శబ్దంగా మారింది. అహుర అనగా దేవుడని అర్థం. పార్శీల దేవదేవుని పేరు. 'అహురామజ్దా' వారి ఇంద్రుడు అసురేంద్రుడు. అంతేగాని సురేంద్రుడు కాదు.

అస్సీరియనులు సెమిటిక్ తెగలకు చెందినవారట. వారి మతం అసురమతం. వారి దేవునిపేరు అస్సురుడు. వారిదేశం అస్సీరియా. వారి రాజుల్లో అస్సుర్‌దాన్. అస్సుర్‌నత్సిరుహల్, అసురబనిపాల్ మున్నగు వారు ప్రసిద్ధులు. వారు మూడువేలఏళ్ళక్రితం బాబిలోనియా, ఆర్మేనియా. మెసపొటేమియా మున్నగు దేశాలను జయించి పాలించారు. వారి నాగరికత గొప్పది. వారి మత గ్రంథాలనుండి యూదులు అనేక విషయాలను స్వీకరించి ఓల్డు టెస్టుమెంటులో చేర్చుకున్నారు.

“పారశీకుల దేవతలు అసురులు. అస్సీరియా ప్రజలు అసురులే, నేటికీ ఛోటా నాగపూర్ ప్రాంతంలో అసురులున్నారు. ఋగ్వేదంలో అనేకచోట్ల అసుర శబ్దం కనిపిస్తోంది. కాని సురశబ్దం కనిపించడంలేదు.

సురశబ్దం ఉపనిషత్కాలంలో పుట్టింది" అని ఆంధ్ర విజ్ఞాన సర్వస్వంలో వివరించారు.

ప్రాచీన దేవతలు అసురులు. అర్వాచీన దేవతలు సురలు. పూర్వ దేవతలైన అసురులు లోకకంటకులు గావడంవల్ల వారిని సంహరించేం దుకు విష్ణుమూర్తి పలు అవతారాలెత్తినట్లుగా ఇతిహాస పురాణాలు ఘోషిస్తున్నాయి.

కాని ఋగ్వేదంలో ఒకచోట మరుద్దేవతలను, మరొకచోట ఇంద్రుని, రెండుచోట్ల రుద్రుని, రెండుచోట్ల అగ్నిని, ఒకచోట పర్జన్యుని అసురులుగా సంబోధిస్తూ ప్రార్థించిన ఋక్కులున్నాయి. అసురశబ్దానికి అనిష్ట పరిహర్త, తేజశ్శాలి, బలశాలి అనే అర్థాలున్నాయి. అసురశబ్దం దేవవిశేషణంగా ఋగ్వేద ప్రథమ మండలంలో ప్రయోగింపబడింది. (ఋ 1-24-14) (1-35-10) (1-54-3)

కనుకనే సాయణాచార్యుల వారిట్టి తావుల్లో గల అసుర శబ్దానికి, శత్రువులను నిరసించువాడు (శత్రూణాంనిరసితా) మిక్కిలి బలముగల వాడు. (ప్రకృష్టాసుబలవంతః) అని అర్థం చెప్పారు. కాబట్టి ఋగ్వేద ఆర్యులు కూడా, ఓ అసురా ఇంద్రా ! ఓ అసురాఅగ్నిదేవా ! ఓ అసురా రుద్రా ! అంటూ దేవతలను ప్రార్థించారని స్పష్టంగా తెలుస్తోంది.

కాని అలా ప్రార్థిచడం మంచిది. కాదనే అభిప్రాయం ఉపనిష త్కాలంలో ఏర్పడింది శంబరాసురుడు రావణాసురుడు బాణాసురుడు మున్నగువారి పేర్లలోగల అసురశబ్దాన్ని దేవ విశేషణంగా ప్రయోగిస్తూ అసురా ఇంద్రా! అసురా రుద్రా ! అని ప్రార్థించడం మంచిది కాదను కున్న ఆర్యులు, తమ దేవతలను సురలుగా వర్ణించి ప్రార్థించసాగారు. కనుకనే వేదాలలో కనుపించని సురశబ్దం ఉపనిషత్తుల్లో కనుపిస్తోంది.

అందువల్ల ఆర్యులకు - ఆర్యేతరులకు మధ్య జరిగిన యుద్ధాలు సురాసుర యుద్ధాలుగా, దేవదానవ యుద్ధాలుగా వర్ణింపబడ్డాయి. దానవులు, రాక్షసులు బ్రిజియా అగారియా వగైరా గణాలు, వారితోపాటు యజ్ఞయాగాదుల నొల్లని వారినందరినీ - చివరకు పర్షియన్లను (పార్సీలను) సహితం అసురులుగా వర్ణిస్తూ నిరసించడం జరిగింది.

## మతవిశ్వాసాల సమన్వయం

సప్తసింధు ప్రాంతంలో విస్తరిస్తున్నదశలో ఆర్యుల దేవుడు ఇంద్రుడు, అంతకుముందు మిత్రావరుణులు. అసలు మొదట్లో ఆర్యులు ప్రార్థించింది అగ్నిని. అగ్నిని ప్రార్థించిన సూక్తములు ఋక్సంహితలో రెండువందల వరకూ వున్నాయి. ఇంద్రుని ప్రార్థించిన సూక్తములు 250 వరకూ వున్నాయి. కాని కాలక్రమేణా ఇంద్రునిపైన ఉపేంద్రుని నిలిపారు. రుద్రుని కీర్తించారు.

దానవులు రాక్షసులు శివభక్తులు. కనుకనే శివుడు "శిశ్న దేవుడు" అని వైదికులొకప్పుడు నిరసించారు. ఈనాడు మొహంజొదారో మున్నగు చోట్ల దొరికిన ముద్రలపైన ఆబోతు, పులి, లేడి వగైరా జంతువుల బొమ్మలతోపాటు శివ-పశుపతి రూపుకూడా వుంది. నంది శివుని వాహనం. పులి, పార్వతి వాహనం. లేళ్ళు వగైరా జంతువులు ఆయాతెగల చిహ్నాలు కనుక ఈనాటి శైవం ఆనాడు ప్రారంభమైందని చెప్పవచ్చు.

విగ్రహారాధన వేదవిహితం కాదు. విగ్రహరూప దేవతారాధన తాంత్రిక విద్యావ్యాప్తికి కారణం. అయినా అత్యధిక ప్రజల పూజా పద్ధతులను ఆర్యులుస్వీకరించారు. సాత్వతుల పాంచరాత్ర పూజావిధానం రూపొందింది. ఇందులో జీవహింసకు తావులేదు. పూజాసమయంలో వాసుదేవునకు

టెంకాయ, తాంబూలం, బియ్యం ఫలపుష్పాదులు సమర్పించేవారు. ఈ మార్పును సమర్థించుకునేందుకు భగవద్గీత తోడ్పడింది.

"నన్ను ఏ రూపంలో పూజించినా, ప్రార్థించినా పత్రం, పుష్పం, ఫలం, తోయం లాంటిదేది సమర్పించినా, నా భక్తులందరినీ సమంగా రక్షిస్తాను" అని శ్రీకృష్ణుడు గాండీవికి చెప్పినమాట శిరోధార్యం కనుక వాసుదేవుని పూజిస్తున్నామన్నారు. కాలక్రమేణా వాసుదేవ, నారాయణ, విష్ణు భక్తులు ఏకమయ్యారు. వైష్ణవం విస్తరించింది.

బోధిసత్వుని విగ్రహాలను బౌద్ధులు పూజిస్తే, శైవులు శివలింగ పూజలు చేస్తే, వైష్ణవులు వాసుదేవ (కృష్ణ) విగ్రహాలను పూజించారు. ఇలా పెరిగిపోయిన విగ్రహారాధన వేదవిహితం కాదని జైమిని మహర్షి, కుమారిలభట్టు మున్నగు పూర్వ మీమాంసకులు వ్యతిరేకించారు. అయినా విగ్రహారాధన తగ్గలేదు. కనుక పురుషసూక్తం గాయత్రిలాంటి వాటిని ప్రార్థనాశ్లోకాలలో చేర్చి, విగ్రహారాధనను వేదసమ్మతం చేశారు. అంటే రాజీపడ్డారు. లేదా సమన్వయం సాధించారు అని చెప్పవచ్చు.

ఇలా జరిగిన వైదిక-వైదికేతర పద్ధతుల సమన్వయంవల్ల ఆర్యుల దేవుడు రుద్రుడు-ఆర్యేతరుల దేవుడు శివుడు కలిసిపోవడంతో, త్రిమూర్తులలోని మహేశ్వరుడవతరించాడు. నాగుల వేపచెట్టుకు-ఆర్యుల రావి చెట్టుకు పెళ్ళిచేసి ఒకే కుదురులో పెట్టి పూజించారు. వినాయకుడందరికీ ఆరాధ్యుడయ్యాడు. ఆయనకు ప్రథమ తాంబూలం లభించింది. ఆదిశక్తి, పరాశక్తి, కాళి, ఛండిక, దుర్గ, పర్వైరా పదాలు పార్వతికి పర్యాయ పదాలయ్యాయి.

## ఆర్య - ఆర్యేతరుల మధ్య వివాహాలు

బాణాసురుడు శివభక్తుడు, శైవుడు. ఆయన తన కోటగుమ్మం మీద శివలింగాన్ని ప్రతిష్ఠించాడట. బలరామకృష్ణులు వైష్ణవులు. అవతారమూర్తులుగా వర్ణింపబడినవారు. బాణాసురునకు-కృష్ణబలరాములకు మధ్య (శివ కేశవులకు మధ్య) ఘోరమైన యుద్ధం జరిగిందట. కాని చివరకు వియ్యమందారట.

బాణాసురుని కుమార్తె ఉష, కృష్ణుని మనుమడు అనిరుద్ధుడు వివాహం చేసుకున్నారు. తరువాత యాదవ కన్యలకు ఉష నాట్యం నేర్పిందట. అసురులు అనాగరికులు, ఘోరాకారులు, నరమాంస భక్షకులైతే యాదవకన్యలకు ఉష నాట్యమెలా నేర్పగలదు? అసురులకు-ఆర్యులకు మధ్య వివాహబంధ మెలా ఏర్పడింది? చేతలకు, రాతలకు సంబంధంలేమ అంతేగా?

"సాతవాహనరాజు తండ్రి సాతుడొక యక్షుడు. సాతవాహనుని తల్లి ఒక మునికన్య.... బృహత్కథను రచించిన గుణాఢ్యుని తల్లి యొక బ్రాహ్మణ కన్య. తండ్రి నాగయువరాజు" అని ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి అన్న గ్రంథంలో ప్రొఫెసర్ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు వ్రాశారు.

ఉషా-అనిరుద్ధుల వివాహం, ప్రభావతీ-ప్రద్యుమ్నుల సంబంధం; యయాతి-దేవయాని పరిణయం, యయాతి-శర్మిష్ఠల ప్రణయం, భీమసేన-హిడింబల సంబంధం, ఉలూపి-అర్జునుల సంబంధం లాంటివెన్నో జరిగాయి. ఆర్యప్రజాపతి పుత్రిక ఒక రాక్షస ప్రముఖుని వరిస్తే, ఆమె చెల్లెలు కుమారస్వామిని వరించిందట.

ఇలా సంబంధ బాంధవ్యాలు నెరపుకున్న ఆర్యులు, ఆర్యేతరులు కూడా అభివృద్ధిచెందగలిగారు. అలాగాక, మా రక్తమే గొప్పది—మా పద్ధతులే గొప్పవి అని గర్విస్తూ, "నన్ను ముట్టుకోకు నా మాలకాకీ" అంటూ గిరిగీసుకుని మడి గట్టుకు కూర్చున్నవారు దిగజారిపోయారు.

## మరికొన్ని నగ్నసత్యాలు

ఒకవైపున ఆర్యేతరులతో యుద్ధంచేస్తూ, చేతులు కలుపుతూ బలపడిన ఆర్యులు-మరోవైపున తమలోతాము యుద్ధాలకు తలపడ్డారు. కౌరవ-పాండవుల మధ్య జరిగినట్లుగా వర్ణింపబడిన భారత యుద్ధంలో ఆర్యులు-ఆర్యేతరులు కూడా అటుసగం ఇటు సగంగా చీలి పోరాడారట. నరకాసురుని కొడుకు భగదత్తుడు, అసురవీరులు అలంబుస హలాయుధులు కౌరవుల పక్షాన పోరాడగా, రాక్షసవీరుడు ఘటోత్కచుడు, నాగవీరుడు ఇరావంతుడు పాండవుల పక్షాన పోరాడారట. పాండ్యులు పాండవుల పక్షాన నిలబడితే, ఆంధ్రులు కౌరవుల పక్షాన నిలబడ్డారు.

అంతకుముందు మయుడనే పేరుగల దానవశిల్పి ధర్మరాజునకొక సభామందిరాన్ని నిర్మించిపెట్టాడు. మయుడు నిర్మించిన సభ కాబట్టి అదీ మయసభగా పేరుగాంచింది. దాన్నిజూచి దుర్యోధనుడు ఈర్ష్యతో కుమిలిపోయాడు. ఇంద్రుని పనుపున విశ్వకర్మ (ఆర్యశిల్పి) నిర్మించిన ఇంద్రప్రస్థ పట్టణం మయసభ ముందు వెలవెలపోతూ దివిటీముందు దీపంలా కన్పించిందట. ఇంద్ర, కుబేర, బ్రహ్మసభలు సహితం మయసభకు దీటు రావని నారదుడు మెచ్చుకున్నాడట.

ఈ కథలో అతిశయోక్తులున్నాయి. అయినా ఒకవిషయం తేటతెల్లమవుతోంది సుందరమైన పట్టణాలను, సభామందిరాలను నిర్మించగల నేర్పు దానవ శిల్పులకు కలదని, సింధు నాగరికత విలసిల్లిన ప్రాంతాలలో

పట్టణాలు నిర్మించిన అనుభవంతో వారు నిపుణులయ్యారని విశదమవు తోంది.

గంగానదీ లోయలోని బుక్సార్ వద్ద డాక్టర్ బెనర్జీగారొక శిథిల నివాస కేంద్రాన్ని కనుగొన్నాడు. అది నాలుగువేల ఏళ్ళక్రితం నిర్మింప బడినదట. ఆ శిథిలాలలో కనుపించిన మట్టిబొమ్మలు సుమేర్, ఈజియన్, సింధు ప్రాంతాలలో కనుపించిన వాటిని పోలివున్నాయని శ్రీ రాధాకుముద ముఖర్జీ చెప్పాడు. కాబట్టి బుక్సార్ కేంద్రం అసుర తెగలవారిదేనని పరి శోధకులు నిర్ణయించారు.

"ఛోటా నాగపూర్ ప్రాంతంలో అసురులున్నారు. బ్రిజియా, అగా రియా తెగలవారుకూడా అసురతెగలకు చెందినవారే. ఆర్యులు వీరిని గంగా నదీతీరంనుండి తరిమివేశారు .. ఈ అసుర తెగలభాష "ముక్మ" ఈభాషలో ద్రావిడభాషా పదములనేకం చేరాయి. అయినా ఇది ముండా జాతి భాషను ఎక్కువగా అనుసరిస్తుంది" అని ఆంధ్ర విజ్ఞాన సర్వస్వంలో వ్రాశారు.

ఈ అసుర తెగల్లో బాల్యవివాహాలులేవు. చిల్లర దేవతలను భూత పిశాచాలను పూజించరు. సృష్టికర్తయైన వాడొకడు కలడని విశ్వసిస్తారు. కాని సృష్టికర్తకు పూజలతో నిమిత్తం లేదంటారు. పితృదేవతలను మాత్రం పూజిస్తారు.

మధ్యప్రదేశ్‌లో రావణాసురుని గుడి వుంది. మేఘనాథుని విగ్రహ ముంది.

"బస్తర్ ప్రాంతంలోని దట్టమైన అడవుల మధ్య, మహానది వొడ్డునగల సోనేపూర్ ప్రక్కన రావణాసురుని లంకవుంది. ఇటీవల ఆ ప్రాంతంలో జరిపిన త్రవ్వకాలలో బయల్పడిన కోటగోడలు, మానవ కంకాళాలు, మృణ్మయపాత్రలు. ఇతర శిథిలాలు రావణుని పాలనను రుజువు చేస్తున్నాయి" అని డాక్టర్ హెచ్. డి. శంఖాలియా ప్రకటించాడు

సోనేపూర్ ప్రాంతానికి 'అసురగడ్' అనే పేరుంది. సంబల్‌పూర్ యూనివర్శిటీ సహాయంతో పురావస్తు శాస్త్రవేత్తలు శ్రీ అశోక్ మరాఠే, శ్రీ రావుజోష్ పాండేలు ఆ ప్రాంతంలో పరిశోధనలు జరిపారు. అక్కడ దొరికిన మృణ్మయ పాత్రలు నాలుగువేల ఏళ్ళనాటివని వారు ప్రకటించారు.

"ఆ ప్రాంతంలో నివసిస్తున్న గోండ్ జాతివారిప్పటికీ రావణుని పూజిస్తున్నారు. మతకర్మల్లో భాగంగా కొన్ని తెగలవారిప్పటికీ హనుమంతుని దిష్టిబొమ్మను తగలబెడుతున్నారు. శబరి వారసులుగా పురాణాలలో వర్ణింపబడిన సవరలు రాముణ్ణి పూజిస్తున్నారు" అని డాక్టర్ శంఖాలియా ప్రకటించారు.

అంటే, ఆర్యులతో చేతులు కలిపిన శబరులు రాముని పూజిస్తోంటే, వారికి వ్యతిరేకంగా గోండులు మున్నగువారు రావణుని పూజిస్తూ హనుమంతుని దిష్టిబొమ్మను తగులబెడుతున్నారన్నమాట. కనుక సరియైన చారిత్రక ఆధారాలు లేనప్పటికీ వటవృక్షంలా విస్తరించిన రామాయణప్రభావం గిరిజన తెగలమీద సహితం ఎలా ప్రసరించిందో తెలుసుకోవచ్చు.

ఇలా దానవ రాక్షసాది అసుర తెగలకు సంబంధించిన సమాచారం దేశంలోని తూర్పుప్రాంతంలో మాత్రమేగాక దక్షిణ ప్రాంతంలోకూడా కొంత లభించింది. తమిళనాడులో రావణ ఇంద్రజిత్తుల విగ్రహాలు చాలా బయటపడినాయి. తెలంగాణాలోని ప్రాచీన సమాధులను రాక్షస గుడులు అని పిలుస్తున్నారు. ఈ సమాధులు సిథియన్ల సమాధులవలె వున్నాయట. వీటిలో కనుపించిన కుండలమీదగల చిహ్నాలు హరప్పలో కనుపించిన చిహ్నాలను పోలివున్నాయి.

శాతవాహనుల పాలనకు ముందు నాగులతోపాటు ఆంధ్రలోని కొంత ప్రాంతాన్ని దానవులు పాలించినట్లుగా తెలుస్తోంది. గోదావరీ తీరంలో

నిశుంభుడను దానవుని ఆంధ్ర విష్ణువు సంహరించి, వాని రాజ్యమును ఆక్ర మించినట్లుగా తెలుపుతున్న కథ బ్రహ్మాండపురాణంలో వుంది. కడప కర్నూలు మండలంలో దానవులు నివసించారనే అభిప్రాయాన్ని శ్రీ కొత్త భావయ్యచౌదరి వెల్లడించాడు. దానవులపాడు అనే గ్రామం కర్నూలు జిల్లాలో వుంది. కనుక సింధు నాగరికత క్షీణదశ ప్రారంభమైన పిమ్మట దానవ రాక్షసాది అసుర తెగలవారు కొందరు దేశంలోని తూర్పు ప్రాంతా లకు వెళ్ళగా మరికొందరు దక్షిణాదికివచ్చి నివసించారని ఖచ్చితంగా చెప్ప వచ్చు. వీరిలాగే ద్రావిడ తెగలవారుకూడా తూర్పు దక్షిణ ప్రాంతాలకు తరలివచ్చారు.

అయినా దనుజ దానవాది అసురుల మాట ఎత్తకుండా, సింధు నాగరికత ద్రవిడులదేనని కొందరు శాస్త్రవేత్తలు చెప్పడం వల్ల ను, కాదని మరి కొందరు చెప్పడం వల్ల ను అయోమయ పరిస్థితి ఏర్పడి. వాద ప్రతి వాదనలు సాగిపోతున్నాయి. –

దానవ రాక్షసాది అసురులను ఘోరాకారులుగాను, నరమాంస భక్ష కులుగాను వర్ణిస్తూ ఆర్య పండితులు అనేకం వ్రాశారు. అందువల్ల దానవ రాక్షసాదుల పేర్లు కర్ణ కఠోరంగా వుంటున్నాయి . కనుక ఆ పేర్లను చెప్పడం ఇష్టంలేని శాస్త్రవేత్తలు, ద్రావిడులు, అనార్యులు వగైరా పేర్లను వల్లిస్తున్నారు.

కొందరు శాస్త్రవేత్త లలాచేయలేదు. రాక్షస దానవాది తెగలకు సింధు నాగరికతతో సంబంధమున్నదని ప్రకటించారు.

దానవరాజ్యానికి హరప్ప కేంద్రమై వుండవచ్చు. రాక్షస రాజ్యానికి మొహంజొదారో కేంద్రమై వుండవచ్చు. ఈ రెండు దేశాల వారూ శివపశు పతిని ఆదిశక్తిని ఆరాధించారు. అని శ్రీ యస్. బి. రాయ్ ప్రకటించాడు.

మూడువేల ఏడు వందల ఏళ్ల క్రితం రేవు పట్టణంగా వున్న ద్వారక ప్రాంత వ్యాపారమంతా పుణ్య జన రాక్షసుల పెత్తనంలో వుండే దనే అభిప్రాయాన్ని డాక్టర్. యస్. ఆర్. రావు వెలిబుచ్చాడు

ఆర్యులు హిందూ దేశమునకు రాక పూర్వము, ద్రావిడ జాతుల వారీ దేశములో వ్యాపించి యుండిరని పరిశోధకులు తలచుచున్నారు. ఋగ్వే దాది గ్రంధములందు ఆర్యుల కంటె భిన్నులైన జనులు కొందరుండినట్లు వర్ణనలుగలవు. ఆర్యులు వీరిని దస్యులనియు, అయజ్యులు (యజ్ఞాది కర్మలు చేయనివారు) అనియు పిల్చుచుండిరి. దస్యులుగాను వికృతాకారులు గాను నల్లని మేనురంగు గలవారుగాను, వినసింపబడిన వీరు ద్రావిడ జాతులవారు కావచ్చును. ఆర్యేతరులైన వీరు నాగరికతగలవారై బలవంతు లైనట్లుగా ఋగ్వేదమే సాక్ష్యమిచ్చుచున్నది. వీరికి సైన్యములును కోట లును ఉండెడివి...." అని ప్రొఫెసర్ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు "ఆంధ్రుల చరిత్ర- సంస్కృతి" అన్న గ్రంధంలో వ్రాశారు.

ప్రొ॥ లక్ష్మీరంజనంగారు వ్రాసినట్లు, దస్యులు (దొంగలు)గాను వికృతాకారులుగాను అయజ్యులుగాను వర్ణింపబడినవారు కేవలం ద్రావిడ జాతులవారు మాత్రమే అయితే, సింధునాగరికత ద్రవిడులదేనని చెప్పవచ్చు. కాని అలా చెప్పినప్పుడు దైత్య దానవ రాక్షసాది తెగలవారందరూ పూర్వ ద్రావిడ తెగలకు చెందిన వారేనని చెప్పక తప్పదు. ఇది పొసగని విషయం.

సింధు నాగరికత ఆర్యులదీ కాదు, ద్రవిడులదీకాదు, అది భారత-ఐరోపా (ఇండో-యూరోపియన్) వంశాలకు చెందిన మరొకరిది- బహుశా సిధియన్లది- కావచ్చునని డాక్టర్ యస్. ఆర్. రావు పదే పదే ప్రకటనలు చేస్తున్నారు.

ఇలా భిన్నాభిప్రాయాలెందుకు వ్యక్తమవుతున్నాయి? వేల సంవత్సరాలపాటు ఉపఖండంలోని పలు ప్రాంతాల్లో విలసిల్లిన సింధునాగరికతతో ఏదో ఒక జాతి వారికి మాత్రమేగాక, వివిధ జాతులవారికి సంబంధముండి వుంటుంది. ఇందుకు ఉదాహరణగా సుమేరియన్ నాగరికతను చూడవచ్చు-

మెసపొటేమియాలో సుమేరియన్ నాగరికత ప్రారంభమైనపిమ్మట దాన్ని అక్కాడియన్లు స్వాధీనం చేసుకున్నారు. తరువాత అక్కాడియన్లను జయించి బాబిలోనియన్లు స్వాధీనం చేసుకున్నారు. కొంతకాలం తరువాత ఇండో-యూరోపియన్ తెగలకు చెందిన హిట్టైటులు మెసపొటేమియాను జయించి పాలించారు. మరికొంతకాలం గడచిన పిమ్మట సుమేరియన్ నాగరికతా కేంద్రం అస్సీరియన్ల స్వాధీనమైంది. బాబిలోన్, ఈలం నాగరికతల విషయంలో కూడా ఇలాగే జరిగింది. కాబట్టి సింధు నాగరికత విలసిల్లినకేంద్రాలపైన కూడా వివిధ జాతుల ఆధిపత్యమేర్పడి వుంటుందని చెప్పవచ్చు.

ద్రావిడ భాషల్లోని తర్భవములకు పైశాచీ ప్రాకృతమే మూలమని పలువురు భాషాశబ్ద శాస్త్రవేత్తలు ప్రకటించారు. మూలద్రావిడ భాషను మాట్లాడినవారు, పైశాచీ ప్రాకృతం మాట్లాడినవారు ఒకరికొకరు దగ్గరగా నివశించినప్పుడు మాత్రమే, ద్రావిడ భాషల్లోని తర్భవములకు పైశాచీ ప్రాకృతం మూలం కాగలుగుతుంది. కనుక సింధునాగరికతతో ద్రవిడులకు సంబంధమున్నట్లే పైశాచీ పాకృతం మాట్లాడిన తెగలకు (బహుశా నాగులకు) కూడా సంబంధముండవచ్చు గదా?

గంగానదీ లోయలోని బుక్సార్ వద్ద వొక శిధిల పట్టణాన్ని డాక్టర్ బెనర్జీ కనుగొన్నాడు. అది నాలుగువేల ఏళ్ళకు పూర్వం నిర్మింపబడంది. అది అసురుల కేంద్రమేనని, ఆర్యులు వారిని అక్కడనుండి

తరిమివేశారని పరిశోధకులు వెల్లడించారు. ఆ అసుర తెగలవారిపుడు ఛోటా నాగపూర్ ప్రాంతంలో వున్నారని, బ్రిజియా అగారియా తెగలవారుకూడా అసుర తెగలవారేనని ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం సాక్ష్యమిస్తోంది. కనుక సింధు నాగరికతతో ఆ తెగలకు సంబంధమున్నదని స్పష్టంగా తెలుస్తోంది.

సుమారుగా నాలుగువేలఏళ్ళక్రితం, కుశస్థలి (ద్వారక) ప్రాంత వ్యాపారమంతా పుణ్య జనరాక్షసుల ఆధిపత్యంలో వుండేదనే అభిప్రాయాన్ని డా॥ యస్. ఆర్. రావు వెలిబుచ్చడం, రాక్షసరాజ్యానికి మొహంజొదారో కేంద్రమై వుండవచ్చునని శ్రీ యస్. బి. రాయ్ ప్రకటించడం వల్ల సింధునాగరికతతో రాక్షసులకు సంబంధమున్నదని తేటతెల్లమవుతోంది.

రాతి కట్టడములతోనున్న శంబరాసురుని పురములను దివోదాసు ధ్వంసంచేసి, స్వాధీనం చేసుకున్నట్లుగా ఋగ్వేదంలో వుంది. ఋగ్వేదంలో ప్రముఖంగా కనుపించే యయాతి దేవయానిని పరిణయమాడి, శర్మిష్టను వరించాడు. దేవయాని తండ్రి శుక్రాచార్యుడు దానవుల గురువు. శర్మిష్ట తండ్రి వృషపర్వుడు దానవ చక్రవర్తి. అయినా వారి పేర్లు ఆర్యుల పేర్ల వలె వున్నాయి. కనుక డా॥ యస్. ఆర్. రావు చెపుతున్నట్లుగా వారు భారత్-ఐరోపా వంశాలకు చెందిన ఏవో ఒక తెగకు చెందిన వారేనని ఊహించడానికి అవకాశముంది.

ఇంత వివరంగా సమీక్ష జరిగిన పిమ్మట ఒక విషయం తేటతెల్లమవుతోంది. సింధునాగరికతతో పూర్వద్రావిడ తెగలవారికి మాత్రమేగాక, దానవరాక్షసాది అసుర తెగలవారికి కూడా సంబంధమున్నదని స్పష్టమవుతోంది. దనుజ దానవ రాక్షసాది అసురులను మాత్రమేగాక పూర్వ ద్రావిడులుగాచెప్పబడుతున్న తెగలవారినికూడా ఆర్యులు దస్యులుగాను వికృతాకారులుగాను అయజ్యులుగాను వర్ణిస్తూ అసురులుగా పేర్కొన్నారు. కనుక సింధునాగరికత అసురుల నాగరికతేనని చెప్పడమే సముచితం.

# అణగారిపోయిన గిరిజనులు

సింధు నాగరికత ఏయే దశల్లో ఎలా వృద్ధి పొందిందో నన్న విష యాన్ని శాస్త్రవేత్తలు చక్కగా వివరించ గలిగారు. నాగరికతకు తగిన ప్రాతిపదిక లెక్కడ ఏర్పడ్డాయో? ఏయే ప్రదేశాలకు విస్తరించి పెంపొం దాయో నన్న విషయాన్నికూడా చక్కగా నిరూపించ గలిగారు. కాని నాగ రికత అంకురించిన నాటినుండీ, అణచి వేయబడిన తెగలను గురించి ఎక్కు వగా పట్టించుకోలేదు. అందువల్ల సింధు నాగరికత ఆర్యులదా? ద్రావిడు లదా? అన్న వాదోప వాదాలకే ప్రాముఖ్యత కలిగింది.

పశువులను మచ్చిక చేసి పెంచడం ప్రారంభ మయ్యేంత వరకూ మధ్యభారత్‌లో నీగ్రిడ్సు (నీగ్రిటోస్) దే పైచేయిగా వుండేది. అయినా వారు మందలను పెంచలేదు. అడవి సంపద పైన, వేట పైన ఆధార పడుతూ జీవించారు. కాగా మందలను పెంచిన ముండా తెగలవారు పైచేయి సంపాదించి మాళ్వా మైదానాల నుండి నీగ్రిడ్సును దక్షిణాదికి తరిమేశారు. నీగ్రిడ్సు గతి అధోగతిగా మారింది. కాలవాహినిలో చిన్న చిన్న తెగలుగా చీలిపోయి దక్షిణాది రాష్ట్రాలలోను, అండమాన్ దీవుల్లోను గిరిజనులుగా బ్రతుకుతున్నారు. ఇప్పుడీ నీగ్రిడ్సు జనాభా కూడా తగ్గి పోతోంది.

ఇలాగే బలూచిస్థాన్ లోని బొలాన్ నది ప్రక్కన గల మెహర్ ఘర్ ప్రాంతంలో పశువుల మందలను పెంచి, పోడు వ్యవసాయం ప్రారం భించిన వారు బలపడి, బ్రహూయీ తెగల వారిని అడవుల్లోకి తరిమేశారు.

మందలు పెరగడం, పోడు వ్యవసాయం విస్తరించడం వల్ల మెహర్‌ఘర్‌లో జనాభా పెరిగింది. పెరిగిన జనాభాకు కొత్త ప్రాంతాలు అవసరమయ్యాయి. కనుక మెహర్‌ఘర్ నుండి పలువురు బయలుదేరి, రాజస్థాన్‌లోని కాలిబంగన్‌లో ప్రవేశించి వ్యవసాయాన్ని వృద్ధి చేశారు. గొర్రెపట్టెలు నాగలి తయారయ్యాయి. స్థిరనివాస మేర్పడింది. నివాస కేంద్రం చుట్టూ, రక్షణ కొరకు గోడలుగా రాతి పలకలను పేర్చుకున్నారు. ఈలోగా మెహర్‌ఘర్‌లో ప్రారంభమైన పత్తిపంట కాలి బంగన్‌కు వ్యాపించింది. నూలుబట్టలకు గిరాకీ పెరిగింది. బార్లీ, గోధుమ, చెరుకు పంటలకు, ముఖ్యంగా పత్తిపంటకు అనువైన ప్రాంతాల కొరకు అన్వేషణ ప్రారంభమైంది.

హరప్పా, మొహంజొదారో ప్రాంతాలలో సారవంతమైన భూములున్నాయి. కనుక పలువురక్కడకు వెళ్లి స్థిర నివాసము లేర్పరచుకొని విస్తారమైన ప్రాంతాలలో పంటలు పండించారు. చేతి వృత్తులు పెరిగాయి. ద్రాక్షసారా, కంచు పనిముట్లు, పూసలహారాలు, చేనేత వస్త్రాలు మున్నగునవి తయారయ్యాయి. బట్టీలలో కాల్చిన ఇటుకలతో ఇళ్ళ నిర్మాణం జరిగింది. వినిమయ వస్తువుల మారకంతో పాటు విదేశీ వ్యాపారం ఊపందుకుంది. ఓడల నిర్మాణం, ఓడ రేవుల నిర్మాణం జరిగింది.

అలా దశాంతర్దశల్లో ఒకవైపున నాగరికత పెరుగుతోంటే, మరోవైపున పలు తెగలవారు అరణ్యాల పాలయ్యారు. పశువుల మందలను పెంచని వారు, సారవంతమైన మైదానాల నుండి అడవుల్లోకి నెట్టివేయబడ్డారు. మందలను పెంచినప్పటికీ వ్యవసాయం ప్రారంభించనివారు సంచార తెగలుగా మారిపోయారు. సుగాలీ, లంబాడీ, బంజారాలు అలా దిగజారిపోయినవారే.

పశువుల మందలను పెంచి వ్యవసాయం చేసినవారు వృద్ధిపొందారు. వారి జనాభా పెరిగింది. కనుక వ్యవసాయానికి అనువైన కొత్త ప్రాంతాలకు విస్తరించి అక్కడనున్న తెగలను అడవుల్లోకి నెట్టివేశారు.

అలా నెట్టివేయబడిన "కురుఖ్" తెగవారిప్పుడు ఉత్తర ఛోటానాగపూర్ ప్రాంతంలో గిరిజనులుగా జీవిస్తున్నారు. వారి జనాభా దాదాపు పదకొండు లక్షలు. రాజమహల్ పర్వతాలలో నివసిస్తున్న "మాల్టో" తెగవారి సంఖ్య 90 వేలు మాత్రమే. పదహారులక్షల జనాభా గల "గోండులు" మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఆంధ్రప్రదేశ్, కోరాపుట్టి జిల్లాల్లో గిరిజనులుగా జీవిస్తున్నారు. వేయిమంది "కొరగలు" పడమటి కనుమల్లో నివసిస్తోంటే, ఎనిమిది వందలమంది "తోడాలు" నీలగిరి కొండలమీద నివసిస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, తమిళనాడు, కేరళ రాష్ట్రాలలో 90 వేలమంది "బడగలు"; 9వేలమంది "కురుబలు"; 15వేలమంది "ఎరవలు"; 70 వేలమంది "ఎరుకలు"తో పాటు కొరప, ఇరుల, బర్గన్డి, కైకాడి తెగలవారు కూడా నివసిస్తున్నారు.

మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఆంధ్రప్రదేశ్ సరిహద్దు జిల్లాలలో కొలమి, పార్జి, గడబ, సవర, మన్డ, పెన్గొ, మున్నగు తెగలవారున్నారు. వారి జనాభా దాదాపు రెండులక్షల వరకూ వుంది. ఆంధ్రప్రదేశ్‌లో కోయదొరలు, భూమిపుత్రులు, కొండరెడ్లు వున్నారు. వీరు అడవిసంపద మీద ఆధారపడడంతో పాటు పోడువ్యవసాయం కూడా చేస్తుంటారు.

ఒరిస్సాలోని మహానదీ ప్రాంతంలోను, ఆంధ్రప్రదేశ్‌లోని విశాఖపట్టణం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలలోను దాదాపు 7 లక్షలమంది "ఖోన్డులు" నివసిస్తున్నారు.

# వలస పోయిన ముండా తెగలు

బలూచిస్థాన్‌లోని మెహర్‌ఘర్ ప్రాంతంలో పశువుల పెంపకం, వ్యవసాయం ప్రారంభమైన దశలోనే, మధ్యభారత్‌లోని మాళ్వా ప్రాంతంలో మొండా తెగలవారు కూడా పశువుల మందలను పెంచారు. వ్యవసాయం ప్రారంభించారు. సారవంతమైన మైదానాల నుండి నీగ్రిడ్సును నెట్టివేశారు. మాళ్వానుండి గంగా మైదానాల వరకూ గల ప్రాంతంలో నివాస కేంద్రాలను నిర్మించుకున్నారు. పత్తి నూలుతో బట్టలు తయారు చేశారు. చెరుకు, ద్రాక్ష, వరి, గోధుమ వగైరా పంటలు పండించారు. సింధు నాగరికులతో సంబంధాలు ఏర్పాటు చేసుకున్నారు. కాని ఎగుమతి దిగుమతి కేంద్రాలు సింధునాగరికుల చేతుల్లో వుండడం వలన ముండా తెగలవారు పట్టణ నాగరికతను నిర్మించలేకపోయారు.

అయినా పెరిగిన జనాభా కొరకు కొత్త ప్రాంతాలను అన్వేషిస్తూ అస్సాం, బర్మాలమీదుగా మలయాకు వెళ్ళారు. వీరు మాల్వా ప్రాంతం నుండి వెళ్ళారు కాబట్టి ఆ దేశానికి మలయా అనే పేరు కలిగింది. మలయా నుండి కొందరు బయలుదేరి వియత్నాం వరకూ వెళ్ళి స్థిరపడ్డారు. మరి కొందరు ఇండోనేషియాలో ప్రవేశించారు.

ఆర్యులు గంగా మైదానాల మీదుగా పశ్చిమ బీహార్‌వరకూ విస్తరించిన పిమ్మట ముండా తెగలవాగిని అడవుల్లోకి నెట్టివేశారు. కాగా మొండా (కోల్-కొలేరియన్) తెగలవారిపుడు ఛోటానాగపూర్, మధ్య ప్రదేశ్ ఒరిస్సాలలో గిరిజనులుగా నివసిస్తోంటే మాన్ఖ్‌మేర్ తెగలవారు ఖాసి, జయంతియా కొండప్రాంతాల్లోను, నికోబార్ దీవుల్లోను నివసిస్తున్నారు.

# సింధు నాగరికతలో ధనిక పేద తారతమ్యాలు

మెహంజొదారో, లోథాల్ వగైరా పట్టణాలొక ప్లాన్ ప్రకారం, తీర్చిదిద్దినట్లుగా నిర్మింపబడ్డాయి. మున్సిపల్ కౌన్సిల్ లేదా పంచాయతీ పాలన వంటి అధికారసంస్థ లేనిచో అలాంటి నిర్మాణాలు సాధ్యమయ్యేవి కావని పలువురు పరిశోధకులు ఊహించారు. ఆ ఊహ సరియైనదేనని చెప్పవచ్చు. కాని పరిశోధకులు ఊహించిన మునిసిపల్ కౌన్సిల్, లేదా పంచాయతీ పాలన ప్రజలందరికీ సమానంగా వసతి సౌకర్యాలు కల్పించేందుకు ఏర్పడలేదని విదితమవుతోంది-ఎందువల్లనంటే....

విదేశీ వర్తక వాణిజ్యాలు పెరగడం వలన పారిశ్రామిక కేంద్రాలు విస్తరించి నగరాలుగా రూపొందాయి. నగరవాసులకు అవసరమైన ఆహార పదార్థాలు, పరిశ్రమలకు అవసరమైన ముడిపస్తువులు పల్లెప్రాంతాలనుండి, వ్యవసాయ పశుపోషణ కేంద్రాలనుండి సరఫరా చేయబడ్డాయి. చేతి వృత్తులవారు పూసల హారాలు, చేనేత వస్త్రాలు మున్నగువాటిని తయారు చేస్తే, ఇంజనీర్లు, కార్మికులు కలసి భవనాలను, ఓడలను ఓడరేవులను నిర్మించారు. నావికులు ఓడలను నడిపారు. క్రయవిక్రయాలు, ఎగుమతి దిగుమతి వ్యాపారం వర్తకులు సాగించారు. కనుక విదేశీ వ్యాపారం వల్ల లభించిన వెండి, బంగారాలు ఎక్కువగా వర్తక ప్రముఖులకు దక్కాయి. అంతేగాని అందరికీ సమానంగా దక్కలేదు. కనుకనే ఆయా వర్గాల వసతి సౌకర్యాలలో ఎక్కువగా తేడా కనిపిస్తోంది.

మొహంజొదారో కోటలో మూడంతస్థుల భవనాలు కనుపించాయి. వాటిలో స్నానపుగదులున్నాయి. ప్రతి ఇంటి ఆవరణలోను ఒక బావివుంది. కోట మధ్యలో 180 అడుగుల పొడవు, 108 అడుగుల వెడల్పుగల కొలనుతోపాటు ధాన్యాగారము, సభామందిరము కూడా వున్నాయి. మురుగు నీరు వెలుపలకుపోయే ఏర్పాట్లున్నాయి.

కోటకు వెలుపల తూర్పుదిశలో చాలా ఇళ్ళున్నాయి. ఆ ఇళ్ల మధ్యలో ఆవరణములు (కోర్టుయార్డులు) ఆవరణముల చుట్టూ ఆరేడు గదులు నిర్మింపబడ్డాయి. ఆ గదుల కన్నింటికీ కలిపి ఒకే ఒక స్నానపు గది, వంటగది వున్నాయి కనుక అవి మధ్యతరగతులకు చెందిన అవిభక్త కుటుంబాలవారి కొరకు నిర్మింపబడిన ఇళ్లు కావచ్చు.

ఆ ఇళ్ళకు తూర్పున దిగువ భాగంలో, సైనికుల బారక్సులాంటి కట్టడాలున్నాయి. బహుశా అవి కార్మికుల ఇళ్ళు కావచ్చు. ఇలాంటి నిర్మాణాలే హరప్పా, సుకోర్తడ, లోథాల్ మున్నగు నగరాలలో కూడా కనిపిస్తున్నాయి.

ఇలా ఎందుకు జరిగినట్లు ? విదేశీ వర్తక వాణిజ్యాల ద్వారా లభించిన వెండి, బంగారాలలో ఎన్నదగినంత భాగం వర్తకుల చేతుల్లోకి పోయింది. కనుక ధనిక వర్తక సంఘాలేర్పడ్డాయి. పంచాయతీ పాలనను స్వాధీనం చేసుకున్నాయి. అటుపైన ధనిక వర్తకులు తమ రక్షణ కొరకు కోటలను నిర్మించుకున్నారు. ఆ కోటల మధ్యలో సకల సౌకర్యాలకు నిలయమైన భవనాలను నిర్మించుకున్నారు. పురోహిత వర్గంతో కలిసి అధికారాన్ని చలాయిస్తూ. చేతివృత్తులవారి శ్రమ ఫలితాన్ని, కర్షకుల శ్రమ ఫలితాన్ని, ఇతర కష్టజీవుల శ్రమ ఫలితాన్ని అనుభవించగలిగారు.

మరొక విశేషమేమంటే ? సింధు నగరాలలో మురుగునీరు పోయేందుకు భూగర్భ కాలువలు నిర్మింపబడ్డాయి. ఆ కాలువలకు అక్కడక్కడ

మాన్‌హోల్సు ఏర్పాటు చేశారు. అంటే, ఆ మురుగునీటి కాలువల్లో పని చేసేందుకు పారిశుధ్య కార్మికులు నియమింపబడ్డారన్నమాట. ఎవరా పారిశుధ్య కార్మికులు ? దానిసలు కావచ్చు.

మొహంజొదారో మురుగునీటి కాలువలవెంట గోడలకు అనుకొని మోకాళ్ల ముడుచుకొని కూర్చున్నట్లుగా చిత్రించబడిన బొమ్మకు ఒక గోచీ వుంది. నెత్తిమీద ఒక పిచ్చిటోపీ వుంది. అలాంటి వ్యక్తి దానిస గాక మరెవరవుతాడు ?

ఇలాంటి నగ్న సత్యాలను వెలుగులోకి తెచ్చేందుకు సవివరమైన పరిశోధనలు జరపకుండా, సింధునాగరికత ద్రవిడులదని కొందరు,ఆర్యులదని మరికొందరు చెప్పడం సరియైన సమగ్రమైన చరిత్ర కాజాలదు.

★★

# ASURA NAGARIKATA

*by* MUKKAMALA NAGABHUSHANAM

శ్రీ ముక్కామల నాగభూషణం సంఘ సేవకు యావజ్జీవితాన్ని అంకితం చేసిన వ్యక్తి.

స్వాతంత్ర్య సమరయోధుడు. హరిజన సేవా నిపహంలో పరిణతుడు. కమ్యూనిస్టు ఉద్యమంలో, అభ్యుదయ సాహిత్యంలో, ప్రజా నాట్యమండలి నిర్వహణలో తొలితరం నేతలలో ప్రసిద్ధుడు.

వేద వేదాంగ, జ్యోతిష, ఖగోళ, నిర్మాణ శాస్త్రాల్లో గణ్యుడు.

ఉప్పెన ముంపుకు దివిసీమ దీవుల ప్రజాజీవితం సమస్తం అతలా కుతలం అయినప్పుడు అండగా నిలవడం, కెనెడియన్ బాప్టిస్ట్ ఇంటర్నేషనల్ వారి సహాయంతో ఆ దీవుల ప్రజలకు పునరుజ్జీవనం కల్పించడాలలో అసమాన ప్రతిభ కనపరచి సేవారంగంలో ఒక చరిత్రను సృష్టించారు అక్కడ సముద్ర జలాలలోంచి మంచినీటి పైప్‌లైన్లను నిర్మించి ఆ దీవులకు వ్యవసాయక, రక్షిత జలాలనందించి అపర భగీరథుడిగా అందరిచేత కొనియాడబడ్డారు.

ఆనాడు ఆంధ్రరాష్ట్ర రైతు సంఘం అధ్యక్షుడిగా, ఈనాడు అనేక సాంఘిక సేవా సంస్థలకు వెన్నెముకగా, ముఖ్యంగా జిల్లా రచయితల సంఘం అధ్యక్షుడిగా సేవలందిస్తున్నారు.

సాహితీ రంగంలో వెర్రిపడగలు, తలనీలాలు, శతావతారాలు, ప్రాచీన భారతదేశంలో వైజ్ఞానిక ప్రగతి, స్వాతంత్ర సమర చరిత్ర, ఆకాశవాణి కోసం వ్యవసాయక, సామాజిక అడవుల, ఇంకా అనేక వైజ్ఞానిక విషయాలపై అనేక రూపకాలు అందచేసి విశిష్ట వ్యక్తిగా ప్రశంస అందుకున్నారు.

కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురణ



